


తిరుమల తిరుపతి దేవస్థానములు

ఏప్రిల్ - 2016
రూ.5/-

# సప్తగిరి

సచిత్రమాసపత్రిక

మీ పాదారవిందములకు నిత్యజయమంగళం

Rathnam 3-16

# శ్రీనివాసమంగాపురం, శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామివారి బ్రహ్మోత్సవాల దృశ్యచయనిక



శ్రీదేవి భూదేవి సమేత శ్రీ కల్యాణవేంకటేశ్వరస్వామివారు



కల్పవృక్షవాహనంపై ఉభయదేవేరులతో స్వామివారు



తిరుమల శ్రీవారిఆభరణాలను ఊరేగింపుగా
స్వామివారి ఆలయానికి తీసుకెళ్తున్న తి.తి.దే. ఉన్నతాధికారులు



స్వామివారి గరుడవాహనసేవలో పాల్గొన్న తితిదే శ్రీకార్యనిర్వహణాధికారి,
తిరుమల సంయుక్త కార్యనిర్వహణాధికారి మరియు ఉన్నతాధికారులు



హనుమద్వాహనంపై విహరిస్తున్న స్వామివారు



శ్రీ కల్యాణవేంకటేశ్వరుని దివ్యమంగళ రథోత్సవం



బ్రహ్మోత్సవాల ముగింపులో భాగంగా చక్రస్నానం



కల్యాణవెంకన్న ఉత్సవంలో కోలాటాలు ఆడుతున్న చిన్నారులు

# అరి రావణాంతక ఆదిత్యకుల రామా...

జయ జయ రామ సమర విజయ రామ
భయహర నిజ భక్త పారీణ రామా॥

జలధి బంధించిన సౌమిత్రి రామా
సెలవిల్లు విరచిన సీతారామా
అల సుగ్రీవు నేలిన అయోధ్య రామా
కలిగి యజ్ఞము కాచె కౌసల్యరామా ॥

అరి రావణాంతక ఆదిత్యకుల రామా
గురు మౌనులను గాచే కోదండ రామా
ధర నహల్య పాలిటి దశరథ రామా
హరురాణి నుతుల లోకాభి రామా॥



అతి ప్రతాపముల మాయామృగాంతక రామా
సుత కుశలవ ప్రియ సుగుణ రామా
వితత మహిమల శ్రీ వేంకటాద్రి రామా
మతిలోన బాయని మనువంశ రామా॥

*(సంపుటం.3, సంకీర్తన.300)*

శ్రీరాముడు భయహరుడు. శివుడి విల్లు విరచి సీతను చేపట్టిన సీతారాముడు. శరణన్న సుగ్రీవుణ్ణి కాచిన అయోధ్యారాముడు. విశ్వామిత్రుడి యజ్ఞము పరిసమాప్తి చేయించిన కౌసల్యారాముడు.

రావణాది రాక్షసులను సంహరించిన రవికుల చంద్రుడు. రాతిని నాతిగా చేసిన దశరథరాముడు.

త్రేతాయుగంలో ఇన్ని విశేషమహిమలు చూపిన శ్రీరాముడే వేంకటాద్రిపై కొలువై ఉన్న శ్రీ వేంకటరాముడని అన్నమయ్య ఈ సంకీర్తనలో తెలియజేశాడు.





పాఠకులకు,
రచయితలకు,
ఏజెంట్లకు,
అందరికీ
శ్రీ దుర్ముఖినామ సంవత్సర

# ఉగాది శుభాకాంక్షలు

శ్రీనివాసుని
కరుణా కటాక్ష వీక్షణాలు
అందరిపై అనవరతం
ప్రసరించాలని..
అందరిపై ఆ దేవదేవుడు
ఆయురారోగ్య
ఐశ్వర్యాలు
ప్రసాదించాలని
కోరుకుంటూ..
మీ
సప్తగిరి



**గమనిక!**

ఈ నెలలో పండుగలు, ప్రత్యేక సందర్భాలో ఎక్కువగా ఉండడం వల్ల ప్రతినెలా పాఠకలోకానికి అందిస్తున్న కొన్ని ధారావాహికలు ఈ మాసం అందించలేకపోతున్నాం. పాఠకులు గమనించగలరు.

రాబోవు సంచిక నుండి అన్ని ధారావాహికలు యథా ప్రకారంగా ఉంటాయి.

- ప్రధాన సంపాదకుడు

## 2016 మే నెల ఉత్సవాలు, పండుగలు

**09** శ్రీ పరశురామజయంతి, అక్షయతృతీయ

**10** శ్రీ రామానుజ జయంతి

**11** శ్రీ శంకరజయంతి

**17** తిరుపతి గంగజాతర

**20** శ్రీ నృసింహ జయంతి, తరిగొండ వెంగమాంబ జయంతి

**21** శ్రీ కూర్మజయంతి, అన్నమయ్యజయంతి

**31** హనుమజ్జయంతి

**మే 13 నుండి మే 17 వరకు**
శ్రీగోవిందరాజస్వామి (తిరుపతి) వారి బ్రహ్మోత్సవాలు

**మే 15 నుండి మే 17 వరకు**
శ్రీపద్మావతీశ్రీనివాసుల పరిణయ మహోత్సవాలు, తిరుమల

**మే 18 నుండి మే 27 వరకు**
శ్రీకల్యాణవేంకటేశ్వరస్వామి (నారాయణవనం) వారి బ్రహ్మోత్సవాలు
శ్రీకల్యాణవేంకటేశ్వరస్వామి (హృషీకేశ్) వారి బ్రహ్మోత్సవాలు
శ్రీనారాపుర వేంకటేశ్వరస్వామి (జమ్మలమడుగు) వారి బ్రహ్మోత్సవాలు

**మే 19 నుండి మే 21 వరకు**
శ్రీలక్ష్మీవేంకటేశ్వరస్వామి (దేవునికడప) వారి ప్లవోత్సవాలు

**మే 19 నుండి మే 22 వరకు**
శ్రీపద్మావతీ తాయార్ల వసంతోత్సవాలు, తిరుచానూరు

**మే 25 నుండి మే 27 వరకు**
శ్రీకల్యాణవేంకటేశ్వరస్వామి (శ్రీనివాసమంగాపురం) వారి వసంతోత్సవాలు

**మే 27 నుండి జూన్ 05 వరకు**
శ్రీవేణుగోపాలస్వామి (కార్వేటినగరం) వారి బ్రహ్మోత్సవాలు



వేంకటాద్రిసమం స్థానం
బ్రహ్మాండే నాస్తి కించన।
వేంకటేశసమో దేవో
న భూతో న భవిష్యతి ॥


**గౌరవ సంపాదకుడు**
డా॥ డి. సాంబశివరావు, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దేవస్థానములు.

**పర్యవేక్షకుడు**
శ్రీ ఎన్.ముక్తేశ్వరరావు, ఐ.ఏ.ఎస్. (విశ్రాంత),
ప్రత్యేకాధికారి, ప్రాజెక్టులు, తి.తి.దే.

**ప్రచురణకర్త-ప్రధాన సంపాదకుడు**
డా॥ సి.శైలకుమార్

**సంపాదకుడు**
డా॥ కె.రాధారమణ

**ఉపసంపాదకుడు**
డా॥ కంపల్లె రవిచంద్రన్

**ముద్రాపకుడు**
శ్రీ వి.వీరబ్రహ్మయ్య, ఎం.ఏ., బి.ఇడి.,
ఉపకార్యనిర్వహణాధికారి(ప్రచురణలు & ముద్రణాలయం),
తి.తి.దే., తిరుపతి

**వర్ణ చిత్ర పుటలు**
పి.శివప్రసాద్

**వర్ణ చిత్రాలు, పుటలు రూపకల్పన**
బి.గురుకుమార్ రెడ్డి

సప్తగిరి మాస పత్రిక

విడి ప్రతి : రూ. 5/-
సం॥ చందా : రూ. 60/-
జీవిత చందా : రూ. 500/-
విదేశాలకు సం॥చందా : రూ. 850/-



తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక


# సప్తగిరి


సంపుటి : 46 ఏప్రిల్, 2016 సంచిక : 11


## ఈ నెలలో....



ముఖచిత్రం : శ్రీ సీతారామకల్యాణం
వెనుకచిత్రం : శ్రీరామపట్టాభిషేకం
} కలంకారి చిత్రకారుడు : శ్రీ పి.మునిరత్నం, తిరుపతి



# కౌసల్యా సుప్రజా రామా...

సనాతన ఆధ్యాత్మిక వాఙ్మయంలో శ్రీమద్రామాయణం ఆదికావ్యంగా జగత్ప్రసిద్ధం. ఆ మహాకావ్యం భారతీయసంస్కృతికి మూలకందం. పరమపవిత్రత పూజనీయతను సంతరించుకున్న రమణీయచరితమైన శ్రీరామాయణగాథను సంస్కృతంలో వాల్మీకిమహర్షి మధురాక్షర సమన్వితంగా లోకానికి అందించాడు. ఆనాటి నుండి ఆ ఋషిపుంగవుడు ఆదికవిగా, ఆ గాథ ఆదికావ్యంగా సమస్తలోకాల్లో శతకోటి విధాలుగా పల్లవిస్తుండడం విశేషం.

**"యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే తావద్రామాయణకథా లోకేషు ప్రచలిష్యతి"**

– అన్నట్లుగా శ్రీమద్రామాయణగాథ పర్వతాలు భూమండలంపై ఉన్నంతవరకూ, నదులు పారుతున్నంతవరకూ సర్వలోకాల్లో వ్యాపించే ఉంటుందన్న ప్రఖ్యాతి, ఆ కావ్యవైశిష్ట్యాన్ని చెప్పక చెబుతున్నది.

ఈ మహాకావ్యనాయకుడు పురుషోత్తముడైన శ్రీరామచంద్రుడు. ఆయన నామోచ్ఛారణం ఒక బోయవానిని మహాకవిగా మలిచింది. ఆదికవిగా మార్చింది. అంతేగాక పురుషోత్తముడైన శ్రీరాముని పితృవాక్యపాలనం, ఒకే సతి, ఒకే మాట, ఒకే బాణం అన్న ఆయన నియమ నిష్ఠలు, స్నేహానురక్తి, ప్రతిజ్ఞాపాలన, శిష్టరక్షణ, ఉదారత్వం... అలాగే సీతామతల్లి పాతివ్రత్యం ఓపిక, ఓర్పు, ఆదర్శవంతమైన ధర్మనిర్వహణ, ప్రవర్తన, పుత్రవాత్సల్యం, దశరథుడి పుత్రప్రేమ, భరతాదుల సోదరప్రేమ, లక్ష్మణుని సేవకత్వం, శ్రీరామబంటు ఐన ఆంజనేయుని స్వామిభక్తి పరాయణత్వం, సహజమైన శ్రద్ధా, సమయజ్ఞత, అకుంఠిత బ్రహ్మచర్యం, భక్తులపాలిట అభయప్రదానం... ఇలాంటి లోకోత్తరమైన సద్గుణవిశేషాలు ఇక్కడ తప్ప, ఇంకెక్కడా గోచరించవు. ఇక్కడ గమనించవలసిన అంశం ఒకటి ఉంది. ఇన్ని విశిష్టగుణాలతో శ్రీరాముడు ఉత్తమపురుషుడై ఆదర్శంగా నిలిచాడు. పండితులకైనా, పామరులకైనా గుండెగుడిలో నిండిపోయిన 'ఆత్మారాముడు' అయోధ్యారాముడు. శ్రీ తాళ్లపాక అన్నమాచార్యులవారు శ్రీవేంకటేశ్వరస్వామిని వేంకటరామునిగా కీర్తించాడు. తిరుమల శ్రీవారి ఆలయంలో సుప్రభాత సంధ్యాసమయంలో 'కౌసల్యాసుప్రజారామా...' అని వేంకటరాముణ్ణి మేలు కొలుపుతారు.

ఇక సద్గుణాభిరాముడైన శ్రీరామచంద్రుడు పురుషోత్తముడై దేవుడైనాడు. శ్రీమద్రామాయణం మహిమాన్వితమైన నిత్య పారాయణ గ్రంథం అయింది. భగవద్రామానుజులవారు శేషాచలం పాదాలచెంత శ్రీమద్రామాయణాన్ని గురుముఖతః విన్నారు. పద్దెనిమిదిసార్లు రామరసాయనాన్ని పారాయణం చేశారు.

కనుకనే ఊరూరా, వాడవాడలా శ్రీరాముని గుళ్లూ, గోపురాలు వెలిశాయి. అంతేకాదు, అలనాడు శ్రీసీతారామలక్ష్మణులు సంచరించిన ప్రదేశాలు, దివ్యస్థలాలు ప్రజల్లో సంస్కృతితోపాటు భక్తిని పెంపొందించే పుణ్యక్షేత్రాలై వర్థిల్లుతూ ఉన్నాయి. అంతేకాదు. ఆనాటినుండి శ్రీరామునిగాథ కావ్యాలుగా, యక్షగానాలుగా, నాటకాలుగా... ఇలా అనేక ప్రక్రియల్లో రచింపబడుతూ పరిఢవిల్లుతూనే ఉంది. శ్రీరామచంద్రుడు అవతరించిన **"శ్రీరామనవమి"** పర్వదినాన్ని ఘనంగా దేశమంతటా నిర్వహించడం కద్దు. కొందరు 'ఉగాది' పండుగ మొదలు శ్రీరామ నవమిదాకా "వసంతనవరాత్రులు" వేడుకగా నిర్వహిస్తే, మరికొందరు "శ్రీరామ నవమి"నాటినుండి శ్రీరామనవరాత్రులు వైభవంగా చేస్తారు.

అందువల్లే ప్రజల్లో ధార్మికమైన చైతన్యాన్ని పెంపొందిస్తున్న శ్రీమద్రామాయణంలోని ఒక్క అక్షరమైనా చాలు, మహాపాతకాలను పోగొడుతుందన్న ప్రశస్తి జగద్విదితం.

**శ్రీరామ జయరామ జయ జయరామ**

# సౌమనస్యమే శుభాకాంక్ష

– బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మ

పరిణామలక్షణం కలిగింది కాలం.

ఆ పరిణామాలన్నీ మేలు కలిగించాలని ఆశించి, శుభసంకల్పాలతో కాలాన్ని స్వాగతించడమే మనం చేయవలసింది.

ఏ మార్పూ లేని స్థిరత్వం నిష్ప్రయోజనమే. మార్పు జరిగిన ప్రతిసారీ మేలూ కీడూ కలిసే పలకరిస్తాయి. మేలును స్వీకరిస్తూ, కీడును సానుకూలంగా మలచుకో గలిగే తెలివికే 'సమర్థత' అని పేరు. ఈ సమర్థత కలిగిన వారికి కాలంలో ప్రతి మలుపూ గెలుపే.




మంచి ఫలితాన్ని సాధించడానికి మొదటిమెట్టు – మంచి సంకల్పం. తన్మే మనః శివసంకల్పమస్తు – అని పలికింది వేదం. నలుగురి మంచినీ కోరుకునే శుభ సంకల్పమే శుభఫలాలను సాధిస్తుంది. ఈ సంకల్పాలతో కూడిన ఆకాంక్షలతో కాలానికి ఆహ్వానం పలకడం సత్సంప్రదాయం.

సమూహసౌఖ్యాన్ని కాంక్షించే వ్యక్తిత్వంలో ముఖ్యమైంది 'సౌమనస్య' భావన. ఒకరిపట్ల ఒకరికి స్నేహం, ఒకే హృదయం కలిగి ఉండటం 'సౌమనస్యం'. పరస్పర సానుకూలత. ప్రస్తుత కాలంలో అన్ని చోట్లా కరవవుతున్న ముఖ్యలక్షణ మిదే. ఒకరంటే ఒకరికి పడకపోవడ మనే ప్రతికూలత– సంఘర్షణలకీ, సంక్షోభాలకీ, విధ్వంసాలకీ మూలకారణం. మనిషి మనిషితో కలిసి బతకలేకపోవడం దౌర్భాగ్యం. జంతువుల్లో కూడా కనిపించని దుర్లక్షణం.

> **ఏ మార్పూ లేని స్థిరత్వం నిష్ప్రయోజనమే. మార్పు జరిగిన ప్రతిసారీ మేలూ కీడూ కలిసే పలకరిస్తాయి. మేలును స్వీకరిస్తూ, కీడును సానుకూలంగా మలచుకోగలిగే తెలివికే 'సమర్థత' అని పేరు. ఈ సమర్థత కలిగిన వారికి కాలంలో ప్రతి మలుపూ గెలుపే.**

అందరూ ఒకే అభిప్రాయం కలిగి ఉండటం సాధ్యం కాదు. కారణం–మనిషికన్న ప్రత్యేకమైన ఆలోచనాశక్తి. అందరి ఆలోచనలూ ఒకేలా ఉండవు. కొందరిఆలోచనలు మరికొందరితో విభేదించడం చేత వివాదాలు, గుంపులు ఏర్పడతాయి. ఇది మానవసమాజంలో సహజం.

స్నేహశీలత అలవరచుకొని, సమష్టిహితమే ఉమ్మడి లక్ష్యంగా ఉన్నప్పుడు విభిన్నభావాలను సమన్వయించవచ్చు. అందులో కొన్ని సర్దుబాట్లు, కొన్ని లాభాలు తప్పకుండా ఉంటాయి. ఈ సౌమనస్య లక్షణం లేనప్పుడు తమ వైమనస్యధోరణినే సమాజమంతా వ్యాప్తి చేయించి విధ్వంసాలను సృష్టించడం జరుగుతుంది.

సృష్టిలో విభిన్నత అత్యంతసహజం. సిద్ధాంతమో, మతమో, కులమో, ప్రాంతమో, భాషో... ఏదో ఒకటి చాలు విభిన్నత్వానికి. ఇవేమీలేని మానవసమాజం ఏ దేశంలోనూ ఉండదు.

నాగరకత కలిగిన మానవ జగతిలో ఇవన్నీ ఉంటాయి. ఆ ఉండటాన్ని అంగీకరించాలి. విభిన్నతలన్నింటి మధ్య సౌమనస్యమనే సూత్రాన్ని మాత్రం దృఢంగా కాపాడుకుంటే సమాజహితం తప్పక సాధించవచ్చు.

మన దృష్టిలో స్నేహశీలత ఉన్నప్పుడు – ఎదుటి వారిని క్షమించగలం, కలుపుకోగలం, ప్రాంత, భాషాది భేదాలెదురైనప్పుడు 'ఏకదేశం' అనే భావనతో ఏకం కావచ్చు.

ఆ ఉమ్మడి ప్రయోజనం కోసం సమన్వయంతో మనుగడ సాగించవచ్చు. సౌమనస్యభావన వల్ల ప్రయోజన మిదే.

మన పరిసరాల్లో, సంబంధాల్లో సౌమనస్యం నెలకొనాలని వేదం పలు శుభాకాంక్షలు పలికింది. 'మైత్రీ భావంతో కూడిన దృష్టితో ప్రాణులన్నింటినీ చూచెదము గాక!' (యజుర్వేదం). ఇది మొత్తం ప్రకృతిలో మానవుని సామరస్యాన్ని ప్రబోధించే శుభకామన.

మనందరం సమానహృదయంతో, స్నేహంతో విద్వేష రహితులమై ఉందాం' (అథర్వవేదం).

'ఈ జగతిలో అందరూ ఏ రుగ్మతలూ లేకుండా ఉండాలి. ఒకరిపట్ల ఒకరు సుమనస్కులై (స్నేహశీలురై) ఉండాలి... అలా ఉండే విధంగా శుభకరమైన వచనాలు పలుకుదాం...' అని యజుర్వేదమంత్రం.

**మాటలో శుభం, మనసులో స్నేహం, ఆచరణలో హితం... ఈ మూడూ కలిగినవాడే 'మనిషి' అనిపించుకుంటాడు.**

**ఈ మనిషితనాన్ని బతికించే విధంగా ధర్మవేత్తలు, గుంపుల్ని నడిపే నేతలు ప్రవర్తించినప్పుడు ప్రపంచశాంతి సుసాధ్యం.**

మనం నిత్యం పలికే మాటలు అందరి హితాన్ని కాంక్షించేవైనప్పుడు, ఇంకొకరిని రెచ్చగొట్టేవి కానప్పుడు-శాంతి తప్పకుండా లభిస్తుందని వేదమాత ప్రబోధం.

మాటలో శుభం, మనసులో స్నేహం, ఆచరణలో హితం... ఈ మూడూ కలిగినవాడే 'మనిషి' అనిపించుకుంటాడు. ఈ మనిషితనాన్ని బతికించే విధంగా ధర్మవేత్తలు, గుంపుల్ని నడిపే నేతలు ప్రవర్తించినప్పుడు ప్రపంచశాంతి సుసాధ్యం.

అలాంటి సౌమనస్యభావన విశ్వంలో వ్యాపించాలని ఈ కాలం మలుపులలో నిలబడి వైదికసూక్తులతో శుభాలను కాంక్షిద్దాం!



## పిల్లలు...

# దేవుడంటే ఎవరు?

– శ్రీ మల్లాది వెంకటకృష్ణమూర్తి

ఓ గ్రామానికి ఓ మహాత్ముడు వచ్చాడు. ఆయన మితభాషి. ఆ గ్రామంలోని ఓ షావుకారు ఆయన దగ్గరికి వెళ్ళాడు.

"స్వామీ! దేవుడంటే ఎవరు?" షావుకారు అడిగాడు.

మితభాషి ఐన ఆ మహాత్ముడు మౌనంగా ఉండిపోయాడు. ఆయన మళ్ళీ అదే ప్రశ్నని అడిగితే, ఆయన మళ్ళీ మౌనంగా ఉండిపోయాడు. షావుకారు ఎన్ని సార్లు ఆ ప్రశ్న అడిగినా ఆయన జవాబు చెప్పలేదు. ఆ మహాత్ముడి మౌనానికి షావుకారికి కోపం వచ్చింది. జవాబు చెప్పనందుకు ఆయన్ని తిట్టినా ఆయన మౌనాన్ని వీడలేదు. కోపంగా వెళ్తున్న ఆ షావుకారికి ఆ మహాత్ముడి ప్రధాన శిష్యుడు ఎదురుపడ్డాడు.

"ఎందుకలా కోపంగా ఉన్నారు?" - శిష్యుడు షావుకారిని ప్రశ్నించాడు.

జరిగింది ఆయన వివరించాక శిష్యుడు చెప్పాడు.

"సరే. మీ ప్రశ్నలకి గురువు గారి చేత జవాబులు చెప్పిస్తాను. రండి."

ఇద్దరూ మళ్ళీ గురువుగారి దగ్గరికి వెళ్ళాక శిష్యుడు అడిగాడు.



"స్వామీ! వీరి ప్రశ్నలకి దయచేసి సమాధానం చెప్పండి."

"నేను వారికి చెప్పిన సమాధానాన్ని వారు అర్థం చేసుకోలేదు.

దేవుడు ఎవరని అడిగాడు.

'మౌనమే దేవుడు' అని నోరు తెరవకుండా చెప్పాను.

ఓర్పు ఉంటే దేవుడు. లేకపోతే జీవుడు అని ఆయన నన్ను తిట్టినప్పుడు కూడా మౌనంగా భరించి చెప్పాను.

కాని, వారు వాస్తవాన్ని గ్రహించలేక పోయారు." అని ఆ మహాత్ముడు చెప్పాడు.












కాలాన్ని భగవద్రూపంగా భావిస్తే
ప్రతిక్షణమూ పండుగే!
అమృతస్వరూపమే! ఆనందనిలయమే!
పవిత్ర విశాలభావన లేకుండా ఆచరించే
పండుగలుదండుగలే అవుతాయి.
పిండివంటలూ, మధురపదార్థాలూ తిని,
రజస్తమోగుణాలు నింపుకోవడం తప్ప,
సాత్త్విక ప్రవృత్తి చేకూరదు.
భగవద్భక్తితో కూడినపుడే పరమానురక్తియై
భగవత్ కృపా పాత్రమౌతుంది.
కనుకనే మనపూర్వులు ప్రతిపండుగకూ
ఒక అధిష్ఠాన దైవం, పూజ, నియమాలూ,
సముచిత ఆహారవిశేషాలూ
ఏర్పాటు చేశారు.
పవిత్రభావంతో చేసే ప్రతికార్యమూ
ఇహపరానంద దాయకమౌతుంది.
ఇతర వ్రతాలూ, పండుగల వలే
ఏదో ఒక దేవతను ఉద్దేశించింది కాక -
ఉగాది సర్వ దేవతాత్మకమూ, తమ తమ
ఇష్టదేవతా స్వరూపమూ అయింది.
ఈ పండుగకు వ్రతకథలు ఉండవు.
ఒక సంవత్సరకాల భవిష్యత్తును
ముందుగా తెలుసుకొని,
ఆయా సమయాల్లో
దైవానుగ్రహప్రాప్తికై చేయాల్సిన
పూజాది సాధనాలను స్థిరపరచుకునే
ఒక చక్కని శాస్త్రీయ ప్రణాళికకు
పూర్వరంగం ఏర్పరచుకోవడం
ఉగాది విశిష్టత!

కాలగణనంలో ఒకప్పుడు మార్గశిరంతోనూ, వైశాఖంతోనూ, కార్తికంతోనూ, ఆశ్వయుజంతోనూ- ఇలా అనేక విధాలుగా సంవత్సరం ప్రారంభమైనవిశేషాలు మన వాఙ్మయంలో కన్పిస్తున్నాయి. అట్లే యుగప్రారంభతిథివిషయంలోనూ కల్ప, మన్వంతరాదిభేదాన్నిబట్టి తేడాలున్నాయి. నక్షత్రాల్నికూడా యుగాదినక్షత్రాలుగా పేర్కొన్నారు.

వరాహమిహిరాచార్యుని నిర్ణయాన్ని బట్టి మనం చాంద్రమానంరీత్యా చైత్ర మాసాన్నే సంవత్సరారంభంగా భావించి, చైత్రశుక్ల ప్రతిపత్తు (పాడ్యమి)నాడు బ్రహ్మదేవుడు సృష్టిని ప్రారంభించాడనే శాస్త్రవాక్కును ప్రమాణీకరించి, దీన్నే "యుగాది"గా గణించి, "ఉగాది" పండుగను ఆచరిస్తున్నాం. అన్ని దేశాలవాళ్లూ ఏదో ఒక కాల గణనంతో ఉగాదిపండుగను తమ సంప్రదాయం ప్రకారం జరుపుతూనే ఉన్నారు. ఆచరించేవిధానంలో తేడా ఉన్నా - ఆశయంలో, ఆనందంలో మాత్రం తేడాలుండవు.

తెలుగువాళ్లే గాక-కర్ణాటకులు, మహారాష్ట్రులు, మాళవీయులు కూడా చాంద్రమానాన్ని అనుసరించి ఉగాదిని 'చైత్రశుద్ధపాడ్యమి' రోజే ఆచరిస్తారు. ఈ సృష్టి జరిగినరోజును పండుగగా-మనం పుట్టినరోజు పండుగగా భావించి, ఆనందో

ఉగాది పండుగ
చాలా ప్రాచీనమైంది.
దాదాపు 197 కోట్ల సంవత్సరాల
ప్రాచీనత గల పండుగ ఉగాది.
భగవద్గీత, ఉగాదిపండుగ
రెండూ సమానప్రాచీనత కలవి.

## ఆచరణవిధానం

ఉగాది పర్వదిన ఆచరణకు పూర్వులు
పది అంశాలు సూచించారు.

01) ప్రతిగృహంలో ధ్వజారోహణం చేయాలి.
02) నువ్వులనూనెతో తలంటుస్నానం చేయాలి.
03) నూతనవస్త్రాలు ధరించాలి.
04) దవనంతో బ్రహ్మను పూజించాలి.
05) అన్ని ఆపదలూ తొలగి శాంతితో, ఆనందంతో జీవించడం కోసం "మహాశాంతి" పూజాహోమాలు చేయాలి.
06) వేపపూత పచ్చడి స్వీకరించాలి.
07) పంచాంగవిశేషాలు వినాలి.
08) చలివేంద్రాలు పెట్టించాలి.
09) పెద్దల్నిదర్శించి, నమస్కరించివాళ్ల ఆశీస్సులు పొందాలి.
10) వసంతనవరాత్రిపూజలు ప్రారంభించాలి.

ఇందులో మనం....
కొన్ని మాత్రమే ఆచరిస్తున్నాం.
ధ్వజారోహణం బదులు
మామిడి, వేపతోరణాలు,
ఆలయాలలో అరటిస్తంభాలూ
అలంకరించుకుంటున్నాం.

తలంటుస్నానం,
నూతనవస్త్రధారణం, పత్రపుష్పాలతో
మన ఇష్టదేవతలను పూజిస్తున్నాం.
వేపపూత పచ్చడి తీసుకుంటున్నాం.
పంచాంగ శ్రవణం గావిస్తున్నాము.
కొందరు చలివేంద్రాలు పెట్టిస్తున్నారు.

పెద్దలకు నమస్కరించి,
వారిఆశీస్సులు పొందుతున్నాము.
వసంతనవరాత్రాలుగా
శ్రీరామోత్సవాలు
శ్రీరామనవమినుండి
తొమ్మిదిరోజులు నిర్వహిస్తున్నాం.

ఇలా ఏదోవిధంగా ఉగాదిరోజు
శాస్త్రం పేర్కొన్న పదిఅంశాలూ
మనం చాలావరకు ఆచరిస్తూనే ఉన్నాం.

త్సాహాలతో సంవత్సరంలో తొలిపండుగగా జరుపుకొంటు న్నాం. జరుపుకోవాలి కూడా! సూర్యోదయానికి పాడ్యమి ఉన్న రోజే (చైత్రశుద్ధపాడ్యమి) ఈ పండుగను ఆచరించాలి. "చైత్రే మాసి" జగద్బ్రహ్మ ససర్జ ప్రథమే-హని, శుక్ల పక్షే సమగ్రంతు తదా సూర్యోదయే సతి" – అని హేమాద్రి నిర్ణయం! కనుక చైత్రశుద్ధ పాడ్యమి సంవత్సరాది. ఉదయానికి పాడ్యమి ఉండాలి. బ్రహ్మదేవుడు చైత్రశుద్ధపాడ్యమి, సూర్యోదయవేళ ఈ సృష్టిని సమగ్రంగా చేశాడు. అందుకు కృతజ్ఞతాసూచకంగా, జ్ఞాపకచిహ్నంగా ఉగాదిపండుగ జరుపుకొంటున్నాం. ఈ పాడ్యమినాడు ఉపవాసం ఉండి, బ్రహ్మను పూజించేవాళ్లు సంవత్సరమంతా సుఖంగా ఉంటారు. ఒకవేళ చైత్రం అధికమాసంగా వస్తే- అధికమాస ప్రారంభం నాడే ఉగాది జరుపుకోవాలి. అంతేకానీ నిజచైత్రారంభంలో కాదు.

చైత్ర, ఆశ్వయుజమాస ప్రారంభంలో-వాతావరణంలో, ఉష్ణోగ్రతలో, ప్రకృతిలో జరిగే మార్పులే మృత్యువుకు కారణాలు. కనుక దేవతాపూజల నెపంతో ఆరోగ్యం, మనశ్శాంతి, ధైర్యం, ఉత్సాహం, భక్తిశ్రద్ధలూ, భవిష్యత్తు ప్రణాళికలలో, అడ్డంకులు తొలగించుకోవాలనే కోరిక మున్నగునవి ఏర్పడి, మానవుడు జీవితాన్ని తీర్చిదిద్దు కొంటాడు. దీనికి తోడు చేసిన పూజాఫలం వెన్నంటే ఉంటుంది.

### ఇష్టదేవతాపూజ

ఉగాదిరోజు తమతమ ఇష్టదేవతలను పూజించడంతో సంవత్సరమంతా దైవానుగ్రహం పుష్కలంగా ఉంటుంది. ఏ కార్యమైనా విజయవంతంగా నిర్వహించుకునే మనోధైర్యం, మనోబలం, ఆత్మవిశ్వాసం ఏర్పడుతాయి.

### ఆరురుచులలో అనేకార్థాలు...

ఉగాదినాడు వేపపూతపచ్చడి తప్పక స్వీకరించాలి. దీన్నే **నింబకుసుమభక్షణం, ఉగాదిపచ్చడి** అని కూడా అంటారు. ఇది ఒక ఔషధం!

## తక్కువేమిమనకూ... రాముడు ఒక్కడుండు వరకూ...

ఉగాది చైత్రశుద్ధపాడ్యమి నుండి పూర్ణిమ దాకా పదిహేను రోజులూ- ఆయా దేవతాను గ్రహసిద్ధి కోసం నిర్వహించే పూజలు శాస్త్రాల్లో ఉన్నాయి. జ్యోతిశ్శాస్త్రం రీత్యా వసంత, శరదృతువులు యమదంష్ట్రలు. మృత్యువు తాండవం చేసే రోజులు.

కనుక అపమృత్యువు వాతపడక, ఆయురారోగ్యాలతో వర్ధిల్లడానికై వసంత ఋతు ప్రారంభంలో విష్ణువునూ, (శ్రీరాముణ్ణీ), శరత్తు ప్రారంభంలో విష్ణుసోదరి దుర్గనూ పూజించాలి. రామానుగ్రహబలముంటే, నవగ్రహబలం ఏమీచేయలేదు కదా!



శాస్త్రం ప్రకారమైతే "క్రొత్తచింతపండు తెచ్చి, నీటితో పిసికి, గింజలు, ఉట్లు, తొక్కలు లేకుండా తీసేసి, చిక్కటి గుజ్జు తయారు చేయాలి. అందులో కాడలు, పుల్లలు లేకుండా శుభ్రపరచిన వేపపూలూ, అందులో కొద్దిగా బెల్లం వేయాలి. కొద్దిగా నెయ్యి వేసి, కలియబెట్టి, దేవునికి నివేదించి, ఉదయాన్నే పరగడుపుననే స్వీక రించాలి.

ఈ వేపపూతను స్వీకరించడంవల్ల నూరేండ్లఆయువూ, వజ్ర సమానమైన దేహం, సర్వసంపదలూ చేకూరి, సంవత్సర మంతా సుఖంగా ఉంటారని పెద్దల సూచన.

కొత్తచింతపండు, బెల్లంలో ఉండేదోషాలతీవ్రత ఉగాది నాటికి తగ్గి, అప్పటినుంచీ అవి ఆరోగ్యప్రదాలై, రుచీ, శుచీ కల్గి ఉంటాయని పూర్వుల నిర్ణయం! వేపపూత పచ్చడిలో శాస్త్రంతో పనిలేకుండా – ఇంకా కొన్ని చేర్చుకొని ఇదంతా షడ్రుచులకు సంకేతమని సమన్వయించుకోవడం ఆచారమయింది. మామిడిముక్కలు, ఉప్పు, చెరకు ముక్కలు, అరటిపండ్లు, తేనెకూడా కొందరు కలుపుతారు. కొందరు మిరియాలపొడి లేదా పచ్చిమిరపకాయముక్కలూ వేస్తారు. మసాలాదినుసులూ వేసేవారున్నారు.

ఈ 'ఉగాదిపచ్చడి' లో మసాలాదినుసులు, ఉప్పు వాడరాదు.

"వసంతఋతుప్రారంభంలో ఆకాలంలో దొరికే వేపపువ్వు, బెల్లం, చింతపండు కలిపి సేవించడం, రాగల కాలానికి స్వాగతం చెప్పడమే అవుతుంది. మధుర, ఆమ్ల (తీపి, పులుపు) ద్రవ్యాలతో చేర్చి, చేదురస ముండే వేపపువ్వును గొజ్జుగా చేసికొని తినడంలో– తియ్యనినోట పండుగపూటా చేదుతినడమే కదా! కానీ చేదువస్తువును తీపు పులుపు పదార్థాలతో కలిపి తినడం, కాలానుగుణంగా ఏర్పడే త్రిగుణాత్మకకష్టసుఖా లనే ద్వంద్వాలకు మేము సంసిద్ధంగా ఉన్నాం. ఏకాలానికి ఏది వచ్చినా సంతోషంగానే స్వీకరించి, అనుభవిస్తాం" అనే ఒక శపథం చేయడానికి – ఈ పచ్చడిని సేవించడం సంకేతం అవుతుంది.

## శుభ్రమైన దుస్తులు - శుభప్రదం



తమకు ఇష్టమైన కొత్త దుస్తులు ధరించాలి. ఇందువల్ల మానసికంగానూ, శారీరకంగానూ ఉత్సాహం, ఆనందం అతిశయిస్తుంది. మాసినపాత దుస్తులు అనారోగ్యకరం. క్రొత్తదుస్తులు ఆరోగ్యకరం. లేనివారైనా పండుగనాడు తలంటుస్నానం చేసి, కొత్త గుడ్డలు ధరించడంతో– ఆ రోజైనా తమ లేమినీ, కష్టాల్నీ మరచి ఆనందాన్ని పొందగల్గుతారు. కనుక అందరూ సమానంగా సుఖంగా ఉండాలనే సమత్వభావానికి సంకేతం– పండుగనాటి నూతన వస్త్రధారణ.

## ఆరోగ్యాన్నిచ్చే అభ్యంగనం

**తిలలు-నూగులు.**
**తిలల నుండి తీసిందే తైలం.**
**కనుక తైల మంటే నూగులనూనెకే పేరు.**
**ఎన్నో ఆరోగ్యగుణాలు తైలంలో**
**ఉన్నందున ఈ పండుగకే కాదు-**
**ఏ శుభకార్యానికైనా తైలాభ్యంగనం**
**విధిగా చేయాలి.**

1) ఉగాదిరోజు నువ్వులనూనెతో తలంటుకొని స్నానం చేయాలి.
2) తలంటుస్నానంవల్ల ఇంద్రియ చైతన్యం, సుఖనిద్ర కలుగుతుంది.
3) నువ్వులనూనె ఉష్ణాన్ని వెలికితీస్తుంది.
4) వాతాన్నీ, చర్మదోషాల్ని హరిస్తుంది. జీర్ణశక్తిని పెంచుతుంది.
5) దేహానికి పుష్టినీ, బలాన్నీ కల్గిస్తుంది.
6) కురుపుల్ని మాన్పుతుంది. వ్యాధికారక సూక్ష్మ క్రిముల్ని నాశనం చేస్తుంది.
7) కంటికి చాలా మంచిది.
8) జ్వరంతో ఉండేవాళ్లూ, మతిస్థిమితం లేనివాళ్లూ, కొన్ని వ్యాధులుండేవాళ్లూ నువ్వులనూనె వాడరాదు.

**వేపపూలు :** వేపపువ్వు చేదుగా, రుచిగా ఉంటుంది. శ్లేష్మాన్నీ, క్రిమిరోగాలనూ, పైత్యాన్నీ, కుష్ఠువ్యాధినీ పోగొడుతుంది. నాలుకకు రుచిజ్ఞానాన్ని కల్గిస్తుంది. వాతాన్ని హరిస్తుంది. వేపపువ్వును నూనెతోగాని, నెయ్యితోగాని వేయించి, ఉప్పు, కారం కలిపి అన్నంతో స్వీకరిస్తే ఆరోగ్యానికి మంచిది. వేపగాలి, వేపాకులు, వేపనూనె ఇలా వేపసంబంధమైన వన్నీ ఆరోగ్య ప్రదాలే.

**బెల్లం :** జ్వరాన్నీ, కడుపునొప్పినీ, ఉదరరోగాలనూ, వాతాన్నీ పోగొడుతుంది. ఒంటిలో నీటిని హరిస్తుంది. నీరసాన్ని తగ్గిస్తుంది. క్రొత్తబెల్లం ఆరోగ్యకారి కాదు. కనుకనే ఉగాదితో ఆదోషంపోతుంది. పాతబడుతుంది. పచ్చడిలో సేవించి నందున ఆరోగ్యాన్ని కల్గిస్తుంది. గుండెదడనుకూడా తగ్గిస్తుంది కడుపులో మంటను తగ్గిస్తుంది. నిద్రపట్టిస్తుంది. (మితిమీరి సేవింపరాదు)

**చింతపండు :** క్రొత్తచింతపండు ఆరోగ్యకరం కాదు. ఉగాది నాటికి చింతపండులో క్రొత్తదనం పోతుంది. ఆనాటినుండి వాడవచ్చు. ప్రాతచింతపండు (కనీసం 2/3 నెలలైనా గడవాలి) ఉష్ణాన్ని తగ్గిస్తుంది. వాతపైత్యశ్లేష్మరోగాల్ని హరిస్తుంది. బడలిక వల్ల ఏర్పడినజ్వరాన్ని తగ్గిస్తుంది. హృదయానికి బలాన్ని కల్గి స్తుంది. జీర్ణశక్తిని పెంచుతుంది. (మంచి దని అధికంగా వాడరాదు)

**నెయ్యి :** ఆయురారోగ్యాల్ని ఇస్తుంది. కంటికి మంచిది. జీర్ణ శక్తి నిస్తుంది. బుద్ధిబలాన్ని పెంచుతుంది. శరీరానికి కాంతి నిస్తుంది. విషాన్ని హరిస్తుంది. పిచ్చిని తగ్గిస్తుంది. రక్తాన్ని శుభ్రపరుస్తుంది. ఓజస్సును పెంచుతుంది. (శక్తి-కాంతి)- (మితిమీరి వాడరాదు.)

**మామిడిపిందెలు :** వడదెబ్బను హరిస్తాయి.

ఇలా ఎన్నోఆరోగ్యగుణాలున్న వేపపూతపచ్చడి సేవించడంతో అందలిగుణాలు రక్తంలో కలసిపోయి, సంవత్సరకాలం వాటిప్రభావాన్ని చూపుతాయి. కనుక ఉగాదినాడు తప్పక వేపపూతపచ్చడి సేవించాలని పెద్దలు సూచించినారు.

జ్యోతిశ్శాస్త్రరీత్యా - ఉగాదినాటికి - చైత్రంలో రవి సంచరించే నక్షత్రాలప్రభావం మనుషులపై అధికంగా ఉంటుంది. ఈ మాసంలో రవి మేషరాశిలో సంచరిస్తాడు. అశ్విని, భరణి పూర్తిగా, కృత్తిక ఒకటవ పాదం - మేషరాశి. అశ్విని - కేతునక్షత్రం. భరణి - శుక్రనక్షత్రం. కృత్తిక - రవి నక్షత్రం. ఈ నక్షత్రాల అధిదేవతలప్రభావమూ జీవులపై పడుతుంది. కేతువు కుజునివంటివాడు. కుజుడు అగ్నిగ్రహం. కేతువూ అంతే! అగ్ని గ్రహమైన రవి, అదే అగ్నికి సమానమైన అశ్వినీనక్షత్రంలో సంచరించు కాలంలో అగ్నిప్రభావం (ఎండ వేడి) ఎక్కువగా ఉంటుంది. అట్లే భరణి, కృత్తికల్లో రవి సంచరించే కాలంకూడా మంచిది కాదు. అనేక అనర్థాలకు కారణమవుతుంది. కనుక ఈ మాసారంభంలో విష్ణువును (శ్రీరాముణ్ణి) పూజించడం, మధురామ్లమిశ్రితమైన వేపపూతను స్వీకరించడంవల్ల మానసికంగానూ, భౌతికంగానూ ప్రశాంతత ఏర్పడుతుంది. ఆరోగ్యం కుదురుగా ఉంటుంది. రవి సంచారం వల్ల కలిగే దోషాలు హరిస్తాయి. రోగాలనుండి విముక్తి కల్గుతుంది.

## పంచాంగశ్రవణ ఫలం

ఉగాదినాటి ముఖ్యఆచరణ అంశాల్లో వేపపూతపచ్చడితో పాటు పంచాంగ శ్రవణం అతిముఖ్యమైనది.

తిథి, వారం, నక్షత్రం, యోగం, కరణం – అనే ఐదు అంగాలు కలది పంచాంగం. ఉగాదిరోజు ఆ సంవత్సర పంచాంగాన్ని మహావిష్ణు స్వరూపంగా భావించి, పూజించాలి. ఆ సాయంకాలం పంచాంగ శ్రవణం చేయాలి.

సంవత్సరాదిలో పంచాంగవిశేషాలు తెలుసుకోవడం వల్ల అన్నిరంగాల్లో తాము ప్రవర్తించాల్సిన విధానాన్ని ఒక సంవత్సరం ముందుగా గ్రహించి, అందుకు తగినట్లుగా కార్యక్రమాలు చేపట్టడం, మానడం అనేది నిర్ణయించుకోవచ్చు. అనంతమైన కాలాన్ని – సంవత్సరమనే ప్రమాణంతో గణించి, గ్రహనక్షత్రాది సంచారాన్నీ, వాటి ఫలాలనూ గుణించి, గ్రహించి, మానవునికి కర్తవ్యాకర్తవ్యబోధ చేసే ముఖ్యసాధనం పంచాంగం.

జీవనప్రయాణంలో మున్ముందుగా వచ్చే సుఖదుఃఖాలనే ద్వంద్వాలమజిలీలనుగూర్చి తెలుసుకొని, మార్గాన్ని సుఖతరమూ, సులభతరమూ చేసుకొని, పురోగమించుటకే పంచాంగశ్రవణం ఏర్పాటైంది. అన్నివర్గాలవారికీ, దేశాలకూ పంచాంగం ఎంతో ముందుచూపుతో ప్రవర్తించేవిధివిధానాల్ని చూపుతుంది. ఖగోళ భూగోళాలకు సమన్వయాన్ని సాధిస్తుంది. కాలవిజ్ఞానాన్నీ, ప్రభావాన్నీ గ్రహించి, మానవులు ధర్మ కార్యనిమగ్నులై ప్రవర్తించాలి.

**"ధర్మాన్ని మనం రక్షిస్తే - ధర్మం మనల్ని రక్షిస్తుంది".**

**పంచాంగంలోని అయిదంశాలకూ ఐదుప్రయోజనాలున్నాయి.**

**1) సంపదకోరేవాడు -** తిథివిషయమై జాగ్రత్త వహించాలి;

**2) దీర్ఘాయువు కోరేవాడు -** వారం విషయంలో;

**3) పాపవిముక్తి కోరేవాడు -** నక్షత్ర విషయంలో;

**4) రోగవిముక్తి కోరేవాడు -** యోగ విషయంలో;

**5) కార్యసిద్ధి కోరేవాడు -** కరణం విషయంలో జాగ్రత్తవహించాలి.

**- అంటే ఏపని చేసినా పంచాంగశుద్ధి - అనగా తిథివారనక్షత్రాదుల శుభత్వం, ఆనుకూల్యం చూచి, తెలుసుకొని ప్రవర్తించాలి.**

**గ్రహనక్షత్రాదుల ప్రభావం తెలుసుకొని ప్రవర్తిస్తే - జీవితం సుఖశాంతులతో వర్ధిల్లుతుంది.**

ఉగాదినాడు మఱ్ఱి, మామిడి, నేరేడు, మేడి, జువ్వి (పంచ పల్లవాలు) ఆకుల్ని నీళ్ళలో నానబెట్టి, ఆ నీటితో అభ్యంగ స్నానం చేయా లనికూడా అన్నారు. ఇట్టి నీటితో స్నానం చేస్తే ఒంటికీ, కంటికీ, మెదడుకూ చాలా మంచిది.

'ఉ' అంటే సంతోషం, శివుడు, విష్ణువు – అనీ, 'గ' అంటే గతి, పొందుట అనీ అర్థాలు. కనుక 'ఉగ' అంటే భగవత్కృప వల్ల సంతోషాన్ని ఒక సంవత్సరం పాటు – ప్రణాళికాబద్ధంగా, ధర్మయుక్తంగా పొందే మార్గానికి – 'ఆది' మొదటి రోజు – అని గ్రహించాలి. 'యుగాది' పదం సృష్టి ప్రారంభాన్ని సూచిస్తే – 'ఉగాది' పదం – ఆ సృష్టి తత్త్వాన్నీ, మూలాన్నీ తెలుసుకొని, అందలి ఆనందాన్ని ఆస్వాదించే సంవత్సర ప్రమాణ విధానాన్ని నిరూపించేది అవుతుంది. ఇలా రెండు పదాలూ 'కార్యకారణఫల' త్రివేణీసంగమంగా మన జీవనాభ్యుదయానికీ, ఆనందానికీ మూలకందాలు! "మూలకందో ముకుందః" కనుక ముకుందారాధన ఉగాదికి ఆత్మ!



పర్వం



# తిరుమల శ్రీవారి సన్నిధిలో...

– శ్రీమతి పి.విజయలక్ష్మి

శ్రీవైకుంఠాన్ని వదలి, భక్తరక్షణకోసం భూలోకానికి వచ్చి, తిరుమల క్షేత్రంలో పుష్కరిణీతీరంలో వెలసిన శ్రీహరి – తెలుగు వారి ఇలవేల్పేగాక, విశ్వానికే తొలివేల్పుగా సేవలందుకొంటు న్నాడు– శ్రీవేంకటేశ్వరమూర్తిగా, శ్రీవేంకటేశ్వరస్వామి తెలుగు వారికి అత్యంత ప్రీతిపాత్రమైన తెలుగుఉగాదిని (సంవత్సరాది) మహావైభవంగా– **"ఉగాది ఆస్థానం"** అనే పేరుతో చేసుకొని, తాను ఆనందిస్తూ, లోకాన్ని ఆనందమయం చేస్తున్నాడు. ఇదంతా నిజానికి భక్తులకొరకే! కాలమే తానైనవాడు స్వామి. తన ఆజ్ఞతో కాలాన్ని నడిపిస్తున్నాడు – మహావిష్ణువు.

అట్టి విశ్వేశ్వరుడూ విశ్వమయుడూ అయిన శ్రీవారు 'ఉగాది ఆస్థానం' జరుపు కొనుట – భక్తుల ఆనందాన్ని చూచి, తాను ఆనందించుటగాక – స్వామికి మరో కోరిక ఏముంది?

**తెలుగు ఉగాది పండుగ నుండే తిరుమలేశుని ఆలయ కార్యక్రమాలూ, ఉత్సవాలూ ప్రారంభమవుతాయి.**

తెలుగు ఉగాది పండుగనుండే తిరుమలేశుని ఆలయ కార్యక్రమాలూ, ఉత్సవాలూ ప్రారంభమవుతాయి. అంటే శ్రీవారి సుప్రభాతసేవతో 'ఉగాది' మొదలవుతుంది. ఉగాదినాడు సుప్ర భాతం కాగానే, తోమాలసేవ జరుగుతుంది. (పిదప ప్రతిరోజూ మామూలుగా కొలువుశ్రీనివాసమూర్తికి జరిగే కొలువు జరు గదు) తోమాలసేవానంతరం శ్రీభూదేవీసమేత శ్రీమలయప్ప స్వామివారికీ (శ్రీవారిఉత్సవమూర్తులు), సేనాధిపతి విష్వక్సేనుల వారికీ ఏకాంతంగా తిరుమంజనం జరుగుతుంది.

తర్వాత బంగారువాకిలికి ముందున్న తిరు మహామణి మండపం (ఘంటామండపం)లో, బంగారువాకిలికి ఎదురుగా ఉన్న గరుడా ళ్వారుకు అభిముఖంగా (ఎదురుగా) బంగారు సర్వభూపాలవాహనంలో దేవేరులతో కూడా శ్రీమలయప్పస్వామి వారిని వేంచేపు చేస్తారు.

పట్టువస్త్రాలతో, వజ్రమాణిక్యాది సువర్ణాభరణాలతో, కిరీటాలతో, సుగంధసుపుష్ప మాలికలతో ఉత్సవమూర్తుల్ని విశేషంగా అలంకరిస్తారు.

శ్రీమలయప్పస్వామివారిఎడమప్రక్కన మరొకపీఠంపై దక్షిణాభిముఖంగా శ్రీవారిసేనాపతి విష్వక్సేనులవారినీ అలం కరించి, శిరస్త్రాణాన్నీ, ఖడ్గాన్నీ ధరించి, మిక్కిలిభయభక్తులతో శ్రీవారిఆజ్ఞల్ని అమలుపరచడానికి సిద్ధంగా ఉన్నట్లుగా, వేంచేపు చేస్తారు. పిదప ఆనందనిలయంలోని మూలవిరాణ్మూర్తికీ, విశేషమైనపడి ప్రసాదాలు, అన్నప్రసాదాలు నివేదిస్తారు.

శ్రీవారిఅర్చకులూ, పెద్దజియ్యంగార్లు, చిన్నజియ్యంగార్లు, ఏకాంగులూ, ఆచార్యపురుషులూ, వేదపండితులూ, దేవస్థానం కార్యనిర్వాహకులూ, ఇతరఅధికారులూ, పేష్కార్లూ, పారుపత్యదారులూ–ఛత్రచామరాలతో, మంగళవాయిద్యాలతో– వేదపఠనం జరుగుతుండగా – శ్రీవారివంటవాళ్ళు విశేషవంటకాలను నివేదనకు ఊరేగింపుగా తెస్తారు. ఈ వంటకాలతో విమాన ప్రదక్షిణంలో బంగారు బావిప్రక్కన ఉన్న వంటశాలనుండి ఉత్సవంగా బయలుదేరి, విమానప్రదక్షిణం చేసి, వెండివాకిలి ఎదురుగానున్న ధ్వజస్తంభానికి ప్రదక్షిణంగా వెళ్ళి, లోపలికి వచ్చి, ఆలయప్రవేశం చేస్తారు. మంగళవాద్యాలు బంగారు వాకిలివద్ద ఆగిపోగా, మిగిలినవారు సన్నిధిలో కొన్ని ప్రసాదాలనూ, బంగారువాకిలివద్ద కొలువులో కొన్ని ప్రసాదాలనూ సమర్పిస్తారు. వెంటనే రెండుచోట్లా ఘంటానాదంతో విశేషనివేదన జరుగుతుంది.

పిదప శ్రీయోగనరసింహస్వామి ఆలయం ప్రక్కననున్న 'పరిమళపుఅర' దగ్గర నుండి పెద్దజియ్యంగారు పెద్దవెండి తట్టలో మడతపెట్టి, చుట్టగా చుట్టబడిన ఆరు పెద్ద పట్టువస్త్రాలను తలమీద పెట్టుకొని, మంగళవాద్యాలతో, వేదపారాయణలతో, దివిటీలదివ్యకాంతుల్లో దేవస్థానం అధికారులైన కార్యనిర్వహణాధికారి, సంయుక్త కార్యనిర్వహణాధికారులు, ఇతర అధికారులూ వెంటరాగా ధ్వజస్తంభానికి ప్రదక్షిణంగా వచ్చి, ఆనందనిలయవిమానానికి ప్రదక్షిణంచేస్తూ – బంగారువాకిలి వద్దకు చేరుతారు. వాకిలిలోపల 'సన్నిధిగొల్ల' దివిటీతో – వీరందర్నీ సన్నిధివరకూ పిల్చుకపోతాడు. శ్రీవారిసన్నిధిలో జియ్యంగార్లు తాము తెచ్చినపట్టువస్త్రాలను అర్చకస్వాములకు అందిస్తారు. జియ్యంగార్లూ, ఏకాంగులూమాత్రమే ఆనందనిలయంలో (గర్భగుడిలో) ప్రవేశిస్తారు. వెంటనే తెరవేస్తారు.

లోపల అర్చకస్వాములు జియ్యంగారు సమర్పించిన ఆరుపట్టువస్త్రాల్లో నాల్గింటిని శ్రీవారిమూర్తికి అలంకరిస్తారు. ఒక వస్త్రాన్ని కిరీటానికీ, రెండవది నందకఖడ్గానికీ, మూడవదాన్ని ఆదితోమాలగానూ, నాల్గవదాన్ని ఉత్తరీయంగానూ అలంకరిస్తారు. తెరతొలగినతర్వాత అర్చకస్వామి బంగారుపళ్ళెంతో పచ్చకర్పూరహారతి ఇస్తారు. ఆ హారతిని ఏకాంగి అందరికీ చూపగా, అక్కడివారందరూ కళ్ళకద్దుకొంటారు. సంప్రదాయాను గుణంగా తీర్థం, శఠారి, చందనం, తాంబూలా(మడుపు)లను అర్చకులు ఇస్తారు. తర్వాత కార్యనిర్వహణాధికారిగారికీ, ఇతర అధికారులకూ తీర్థం, శఠారి మున్నగునవి ఇస్తారు.

పిదప మిగిలిన రెండుపట్టువస్త్రాలున్న వెండితట్టను పెద్దజియ్యంగారు తలపై నిడుకొని తెచ్చి, బంగారువాకిలి వద్దనున్న ఉత్సవమూర్తులకు సమర్పిస్తారు. అర్చక స్వాములు ఒక వస్త్రాన్ని శ్రీమలయప్ప స్వామికీ, మరొకదాన్ని విష్వక్సేనులవారికి అలంకరిస్తారు.

ప్రధానార్చకులు తలకు శ్రీవారిపాద వస్త్రంతో పరివట్టం (తలకు చుట్టూ కట్టే చిన్నపట్టుగుడ్డ) కట్టుకొని, శ్రీస్వామివారిపై, విష్వక్సేనులవారిపై అక్షతారోపణం చేస్తారు. పిదప విష్వక్సేనులవారికి పరివట్టంకట్టి, శ్రీస్వామివారికి వేసిన అక్షతలను గైకొని, విష్వక్సేనులవారిపై చల్లి, శఠారిమర్యాదలు జరుపుతారు. పిదప ప్రధానార్చకులు శ్రీస్వామివారి ద్వారా తండులదానం (బియ్యం), దక్షిణతాంబూలాలు స్వీకరించి, "నిత్యైశ్వర్యో భవ" (నిత్యమైన ఐశ్వర్యవంతుడవు కమ్ము) అని, స్వామివారిని ఆశీర్వదిస్తారు. అక్కడనున్న మరొక అర్చకులు ప్రధానార్చకులకు పరివట్టంకట్టి శఠారి మర్యాదలు చేస్తారు.

ఇలా ఆస్థానపూర్వరంగం జరిగాక శ్రీవారికి ఆస్థానం జరుగుతుంది.



## ఉగాదిఆస్థానం

శ్రీస్వామివారిపాదపద్మాలమీదనున్న పంచాంగాన్ని భక్తితో స్వీకరించి, ఆస్థానసిద్ధాంతి శ్రీస్వామివారికి నూతన పంచాంగ విశేషాలు వినిపిస్తారు. ప్రత్యేకంగా శ్రీవారిజన్మ నక్షత్రమైన 'శ్రవణం' ఫలితాలు వివరిస్తూ "ఓ స్వామీ! మీరు ఈ లోకంలో అవతరించింది– శ్రవణనక్షత్రంనాడు. ఈ సంవత్సరంలో మీరు విశేషదయాంతరంగులై భక్తుల పాపాలను పోగొట్టి 'వేంకట'నామాన్ని సార్థకం చేసుకొంటారు. భక్తులకు సకల సంపదలూ అనుగ్రహిస్తారు. కనుకనే భక్తకోటి ఈ సంవత్సరంలో మీదర్శనానికై అఱ్ఱులుచాస్తూ, తిరుమలయాత్ర చేస్తారు. మీ దయకై, ఆనందానికై ఎన్నోఉత్సవాలు ఎంతో వైభవంగా భక్తితో నిర్వహిస్తారు. మీకు విశేషంగా ధనవస్తు రూపంలో కానుకలు సమర్పిస్తారు. మీ ఆజ్ఞావర్తులైన నవ గ్రహాలూ మీ భక్తుల్ని రక్షిస్తూంటారు. దేశం సస్యశ్యామలమై వర్ధిల్లుతుంది. మీదయవల్ల అతివృష్టి, అనావృష్టి, ఆధివ్యాధులూ లేక విశ్వం హాయిగా ఉంటుంది"– అని విన్నవిస్తారు–సిద్ధాంతి గారు. ఆ సమయంలో శ్రీస్వామివారు అరమోడ్పు కన్నులతో, మందహాసంతో, సంతోషంతో వింటూ అందర్నీ దీవిస్తున్నట్లుగా దివ్యకాంతులతో సాక్షాత్కరిస్తారు.

శ్రీదేవిభూదేవులకుకూడా నక్షత్రఫలాలు చెప్పిన తర్వాత అక్కడనున్న పెద్దలెవరైనా తమ నక్షత్రఫలితాలు తెల్పండని అర్థిస్తే– సిద్ధాంతిగారు వారినక్షత్రఫలితాలూ వినిపిస్తారు. పిదప అర్చక స్వాములు సిద్ధాంతిగారికి శఠారిని అనుగ్రహిస్తారు.

పిదప జియ్యంగార్లగుమాస్తా వచ్చి–ముందు రోజు వచ్చినహుండీరాబడినీ, ఆదాయ వ్యయాలనూ, ఉత్సవవిశేషాలనూ స్వామివారికి వినిపిస్తారు. వెంటనే అర్చకస్వాములు శ్రీమలయప్ప స్వామివారలకు "కొలువు పళ్లెం" అనబడే బంగారుతట్టలో నవనీతహారతిని జరిపి, కార్యనిర్వహణాధికారిగారికి నవనీతం (వెన్న) తాంబూలం ఇస్తారు. పిదప సర్కారుహారతులు కార్యనిర్వహణాధికారిమొదలు పారుపత్యదారు వరకూ ఒక్కొక్కరికి ఒక్కొక్కహారతి క్రమంగా నిర్వహిస్తారు.

**శ్రీస్వామివారి పాదపద్మాల మీద ఉన్న పంచాంగాన్ని భక్తితో స్వీకరించి, ఆస్థానసిద్ధాంతి శ్రీస్వామివారికి నూతన పంచాంగ విశేషాలు వినిపిస్తారు. ప్రత్యేకంగా శ్రీవారిజన్మ నక్షత్రమైన 'శ్రవణం' ఫలితాలు విన్నవిస్తారు. శ్రీదేవిభూదేవులకు కూడా నక్షత్రఫలాలు విన్నవిస్తారు.**

**చివరగా... భక్తులందరి తరపున ఒక్కొక్క రూపాయివంతున సేకరించి, "రూపాయహారతి" ఇస్తారు. పళ్ళెంలో వచ్చిన రూపాయల్ని కార్యనిర్వహణాధికారి ఖజానాకు జమచేస్తారు.**

**ఉగాది రోజు సాయంకాలం తిరుమల నాల్గుమాడవీథుల్లో శ్రీభూదేవీ సమేతంగా శ్రీమలయప్పస్వామివారు ఉత్సవంగా వచ్చి, భక్తులకు నూతనసంవత్సర శుభాశీస్సులతోపాటు, దివ్యమంగళదర్శనం కూడా అనుగ్రహిస్తారు.**

తరువాత మైసూరువారి, తాళ్ళపాకవారి, తరిగొండ వారిహారతులూ జరుగుతాయి. చివరగా భక్తులందరి తరపున ఒక్కొక్క రూపాయివంతున సేకరించి, "రూపాయహారతి" ఇస్తారు. పళ్ళెంలో వచ్చిన రూపాయల్ని కార్యనిర్వహణాధికారి ఖజానాకు జమచేస్తారు.

చివరగా జియ్యంగారికీ, పిదప దేవస్థానం కార్యనిర్వహణాధికారిగారికీ పరివట్టంకట్టి, శఠారిని అనుగ్రహిస్తారు. పిదప ప్రసాదవినియోగం జరుగుతుంది. చందనతాంబూలాలూ, అక్షతలూ కూడా ప్రసాదంతోపాటు ఇస్తారు. ఇలా 'ఉగాదిఆస్థానం' పూర్తి అయ్యాక, భక్తులను సర్వదర్శనానికి అనుమతిస్తారు. ఉగాదిరోజు కల్యాణోత్సవం మున్నగు ఆర్జితోత్సవసేవలు ఏవీ ఉండవు.

సాయంకాలం తిరుమల నాల్గుమాడవీథుల్లో శ్రీభూదేవీ సమేతంగా శ్రీమలయప్పస్వామివారు ఉత్సవంగా వచ్చి, భక్తులకు నూతనసంవత్సర శుభాశీస్సులతోపాటు, దివ్యమంగళదర్శనం కూడా అనుగ్రహిస్తారు.

ఉగాదినాడు సాయంకాలం ప్రారంభమైన ఈ ఉత్సవం 40 రోజులు విధిగా జరుగుతుంది. దీన్ని "నిత్యోత్సవం" అంటారు. వైశాఖశుద్ధదశమి వరకూ ఈ ఉత్సవం ఆగమసంప్రదాయబద్ధంగా నిర్వహింపబడుతుంది.

## ఉగాది ఆస్థానం – ఆధ్యాత్మికానందస్థానం

శ్రీనివాసుడు ఉత్తమమైన వైకుంఠాన్ని వదలి, వేంకటాచలంపై పుష్కరిణీతీరంలో స్థిరనివాసి కావడం భక్తజనోద్ధరణ కొరకే అనుట మనభావన.

భూ, భూమి–శబ్దాలకు 'నీళ్ళనుండి పుట్టింది' అని వ్యుత్పత్తి. శ్రీమన్నారాయణుడు 'నీటిని నివాసంగా గలవాడు'. కనుక భూమి(భూలోకం) స్వామి నుండి ఏర్పడిందే! పంచభూతాలు, మనస్సూ, బుద్ధీ, అహంకారమూ ఈ ఎనిమిదీ స్వామివారి అష్టమూర్తులు. విశ్వమే విష్ణువూ, విష్ణువే విశ్వమూ కనుక – స్వామి భూలోకానికి రావడం తన 'భూమూర్తిని' చూచి ఆనందించడానికే! "సర్వం వాసుదేవమయం" కనుక ఇందున్న చరాచరాత్మక ప్రకృతి అంతా తనమూర్తులే! "నర్తకునిభంగి



పెక్కగు మూర్తులతో నెవ్వడాడు?"నని భాగవతం శ్రీవారిబహు రూపవైశిష్ట్యాన్ని కీర్తించింది.

"కాలః కలయతా మహమ్"–అని గీత! కాలం అన్నింటి కంటే గొప్పద్దై, విశ్వంలోని అన్నింటినీ అణిచివేస్తుంది. గణిం చేదీ, ప్రేరేపించేదీ కాలం. "కదలదు నీదు సంకల్పము లేనిదే గడ్డిపోచయును" కనుక విశ్వానికి ప్రేరణం, కారణం విష్ణువే! రూపంలేని అనంతకాలాన్ని భగవంతుణ్ణిగా భావించి, సంవత్స రాత్మకరూపంతో ఆరాధించడం– ఉగాదిఆస్థాన విశేషం. సర్వా లంకారభూషితుడై స్వామి కార్యకారణశక్తులైన దేవేర్లతో ఆస్థానం చేయడం–తనసర్వాంతర్యామిత్వాన్నీ, సర్వశక్తినీ, భక్త రక్షణ తత్పరతనూ నిరూపించడానికే! సేనాపతి విష్వక్సేనుల వారూ – దక్షిణాభిముఖులై ఉండటం మరోవిశేషం! సర్వత్ర వ్యాపించిన సేనగలవాడు–విష్వక్సేనుడు. ఇతడు సేనాపతి. శ్రీస్వామివారికిని 'విష్వక్సేను'డని పేరుంది. శ్రీహరి సైన్యానికి అధిపతి శ్రీహరియే గాక మరొక్కరుందురా? కనుకనే ఇరువురూ ఒకరే! తానే సైన్యమూ, సైన్యాధిపతియునై ఉంటాడు – స్వామి. దక్షిణాభి ముఖుడై విష్వక్సేను దుండటం యమకింకరుల్ని పారద్రోలి, శ్రీవారిభక్తలకు మృత్యుభయం లేకుండా చేయడానికే!

అర్చకుడు సాక్షాత్తూ హరియే కనుక – భూలోకంలో శ్రవణనక్షత్రంలో అవతరించిన శ్రీవారికి పంచాంగాన్ని శ్రవణం చేయించడం, కాలస్వరూపాన్నీ, కాలప్రభావాన్నీ, కాలఫలాల్నీ వివరించడమే! శ్రీవారిని "నిత్యైశ్వర్యో భవ" అని ఆశీర్వదిం చుట, నిజానికి స్వామిని దీవించడం కాదు. ఇది శుభవాక్కు! స్వామి నిత్యైశ్వర్యవంతుడై ఉంటేనే, భక్తులనూ నిత్యైశ్వర్య వంతుల్ని చేస్తాడు. ఇది 'విజయతాం' అనేమాటవంటిది.

పంచభూత, పంచప్రాణ, పంచేంద్రియాదిపంచతత్త్వాలకు సంకేతం పంచాంగం. ఇట్టి పంచాంగవిశేషాలుస్వామికి విన్పిం చడంద్వారా మనలోని పంచతత్త్వాలను జాగృతంచేసి, చైతన్య పరచి మనల్ని కర్మధర్మోన్ముఖుల్నిజేయడయే అవుతుంది. కాల స్వరూపుడైనస్వామి సన్నిధిలో కాలగణనాన్ని పేర్కొనడం, సంవ త్సరఫలితాలు వివరించడం– స్వామివారి తత్త్వాన్ని కీర్తించడమే!

కాలమూ, విష్ణువూ వ్యాపించే గుణంకలవారే! సర్వమూ కాలాధీనమే! ఆ కాలం విష్ణుదేవునిఆజ్ఞతో ప్రవర్తిస్తుంది కనుక సంవత్సరాదినాడు స్వామిని కాలస్వరూపుణ్ణిగా భావించి పూజిం చడంతో– స్వామికృపవల్ల కాలం మనల్ని కనికరిస్తుంది. మన బుద్ధిని సత్కార్యాచరణకు ప్రేరేపిస్తుంది. ధీశక్తిని పెంచుతుంది. భగవద్భావన లేకుండా పంచాంగశ్రవణం చేసినందువల్ల తీపు లేని పాయసంవలె వృథా అవుతుంది. పంచాంగానికి అధిష్ఠాన దేవత శ్రీమన్నారాయణుడే!

శ్రీవారు వేంచేపుచేసేస్థలాన్నీ, కార్యక్రమాన్నీ ఆస్థాన మని పేర్కొంటారు. ఉగాదినాడు స్వామివారు వేంచేపుచేస్తారు కనుక ఆ కార్యక్రమాన్ని 'ఉగాది ఆస్థానం' అన్నారు. సంవత్సరమంతా సంతోషంగా ఉండటానికి, ఆది=మొదలైనరోజు కనుక సంవత్స రాది 'ఉగాది' అయింది.



ప్రత్యేకం



# సామాజిక విలువలు - అవసరాలు



శ్రీ పోల భాస్కర్, ఐ.ఏ.ఎస్.,
సంయుక్త కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

## స్వచ్ఛత - ఐక్యత - పవిత్రత
**(Purity - Unity - Divinity)**

ఇంటికివెళ్లడం, ఇంటిని కనుక్కోవడం, ఇంటికి చేరటం. ఇవే మానవ మనుగడకు లక్ష్యాలు. ఆ ఇల్లు ఏకత్వంలో, సమైక్యంలో, పవిత్రతలో ఉంది. దాన్ని కేవలం స్వచ్ఛత ద్వారానే చేరుకోగలం. స్వచ్ఛత అంటే త్రికరణశుద్ధి. మనస్సు, వాక్కు, కాయకర్మలఐక్యత. ఆలోచించేది, మాట్లాడేది, ఆచరించేది ఒక్కటే కావటం.

మానవవిలువలు అన్నీ ఈ మహోన్నతమైన స్వచ్ఛత వైపు దారితీసే మార్గాలే! సత్యం, సత్ప్రవర్తన, శాంతి, ప్రేమ, అహింస, త్యాగం అనే విశ్వవ్యాప్త (సార్వజనీన) మానవవిలువలు మనస్సును త్రికరణశుద్ధి అనే స్వచ్ఛత దిశగా తీసుకువెళతాయి.

ఈ విలువలు అన్నీ ఒకదానితో మరొకటి అనుసంధానమై ఉంటాయి. ఒకటి మరొకదానికి మార్గాన్ని చూపుతుంది. ఇలాగే మనలో ఆరుగురు శత్రువులు కూడా అనుసంధానమై ఉన్నారు. వారే కామం, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం అనేవాళ్లు. వీరిలో ఏ ఒక్కరు చురుకుగా పని చేసినా మిగతావాళ్లుకూడా ప్రకోపిస్తారు. మనం శూన్యంలో జీవించలేము. మనం మంచిమానవతా విలువల్ని మనలో స్థిరపరచుకోకపోతే, పక్కనే కాచు కొని వేచిఉన్న లోపలి శత్రువులు మనకు తెలియకుండానే మనలో మెల్లగా ప్రవేశించటం తథ్యం.

సత్యం - ప్రేమతో అనుసంధానమై ఉండాలి.
ప్రేమ - త్యాగంతో అనుసంధానమై ఉండాలి.
అహింస - శాంతితో అనుసంధానం కావాలి.

ఆచరణలో గల సత్యమే సత్‌చర్య (ధర్మం).
అనుభవంగా మారిన సత్యమే శాంతి.
భావోద్వేగంగా గల సత్యమే ప్రేమ.
అవగాహన రూపంలో గల సత్యమే అహింస.
జీవనరూపంలోగల సత్యమే త్యాగం.

ఈ రకంగా అందరూ ఒకరితో మరొకరు అనుసంధానపరచబడ్డాం. అంటే అందరమూ సత్యస్వరూపులమే! మనందరం ఒక్కటే! అదే ఏకత్వం, దివ్యత్వం!

విద్యనుంచి నిజమైన ప్రయోజనాన్ని పొందాలంటే, దాన్ని విలువలతో జోడించాలి. విలువలతో కూడని విద్య అహంకారాన్నీ, దంభాన్నీ పెంచుతుంది. వాటితో తనను తాను విస్మరిస్తాడు. మేధ మేఘావృతం అవుతుంది. అది హానికరం, ప్రమాదకరం!

నిజమైన విద్య మనసును స్వచ్ఛపరచాలి. స్వచ్ఛతవల్ల స్పష్టత, పారదర్శకత పెరుగుతాయి. అపుడు మనం దివ్యజ్ఞానంతో అనుసంధానం అవుతాం. అదే సర్వవ్యాపకమైన జ్ఞానం. ఇది పారదర్శకమైన మనస్సు ద్వారానే సంభవిస్తుంది, ఆత్మను సుస్పష్టంగా ప్రతిబింబిస్తుంది.

దాని ద్వారా మనం దివ్యజ్ఞానంతో, దివ్యశక్తితో, దివ్యపోషణతో అనుసంధానం అవుతాం. ఈ విధంగా మానవుడు సాధించగలిగిన అత్యుత్తమ సృజనాత్మకతను అభివృద్ధి చేసుకోగలుగుతాం. ఇలా స్వచ్ఛత సృజనాత్మకతను వృద్ధి చేస్తుంది, దివ్యమేధతో కలుపుతుంది. స్వచ్ఛత, సచ్ఛీలం నుంచి వస్తుంది. శీలం విద్యలో గల విలువలతోపాటు అందుతుంది. విలువలను నేర్పని విద్య వాసనలేనిపుష్పం వంటిది.

విద్యకు విత్తనాలు – వాటినుంచి అందే ఫలాలు–వినయం, మంచితనం,



సృజనాత్మకత, ఐకమత్యం, నిర్మలత్వం, పవిత్రతలు. సత్యం యొక్క విలువే గాంధీజీని మహాత్మునిగా చేసింది. సత్ప్రవర్తనే శ్రీరాముణ్ణి ఆదర్శమానవునిగా, ఉత్తమకుమారునిగా, భర్తగా, సోదరునిగా, రాజుగా చేసింది.

ప్రేమకు గల శక్తియే అవతార పురుషుల్ని సృష్టించింది. చేసింది. త్యాగపు విలువలే మాతృమూర్తులను ప్రత్యక్షదైవాలుగా అందిస్తున్నాయి.

**విలువలు నేర్పని విద్య నిరర్థకం –**
**అది సమాజానికి శాపం.**

**విలువలు నేర్పే విద్య –**
**సమాజానికి ఒక వరం.**



:: 05 – సమాధానాలు ::

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 పి | నా | 2 క | పా | 3 ణి | | 4 సే | నా | 5 ని |
| క | | ల | | పా | | న | | గ |
| 6 ము | ల | హ | | ణా | | 7 త | మ | మ |
| | | ప్రి | | వీ | | సం | | శ |
| 8 సం | జ | యు | డు | | 9 దే | వ | శ | ర్మ |
| వ | | డు | | 10 హే | | | | |
| 11 ర | ణం | | | 12 మ | ల | 13 య | జ | 14 ము |
| ణు | | 15 రే | | మా | | లి | | క్తు |
| 16 డు | రు | గు | | 17 ల | చ్చి | మ | గ | డు |




# తిరుమల విశిష్టత

- బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావుశర్మ

**తిరుమల క్షేత్రంలోని ఏడుకొండలే వృషభాద్రి, వృషాద్రి, గరుడాద్రి, అంజనాద్రి, శేషాద్రి, వేంకటాద్రి, నారాయణాద్రి.**

ఆత్మస్వరూపమైన పరమాత్మే ఏడు కొండలమీది వేంకటేశ్వరుడు. నారములు అంటే జీవులు. వాటన్నిటికీ ఆధారభూత మైన స్వరూపమే నారాయణాద్రి మీద ఉండే వేంకటేశ్వరుడు.

ఏడుచక్రాలూ దాటితే – ఆనందా నుభూతి కలుగుతుంది. ఆనందనిలయం బ్రహ్మస్థానంలో ఉంటుంది. అక్కడ సహ స్రారమని వెయ్యి రేకులపద్మం ఉంటుంది. శ్రీవిద్యలో షట్ చక్రభేదనం చేస్తారు. మూలాధారం, స్వాధిష్ఠానం, మణిపూరం, అనాహతం,విశుద్ధి,ఆజ్ఞాచక్రం ఉంటాయి. షట్చక్ర భేదనం చేస్తే- సహస్రారంలో 'పరమశివపర్యంక నిలయాం' అని శివుని తొడమీద కూర్చున్న అమ్మవారి దర్శన మవుతుంది.

ఇట్టి సాధన చేసిన యోగినాడీ మండలం అమృతవృష్టిచేత తడిసి పోతుంది. అలా అనుభవించగలిగిన ఆనందస్వరూపమే పరమాత్మ. ఏడు కొండలమీదే ఆయన ఉంటాడు. ఏడు కొండలు ఎక్కడంలో ఒకరహస్యం ఉంది. ఆ ఏడుకొండలు సాలగ్రామాలు, అక్కడి చెట్టు, పుట్ట- పిట్ట, ఏదైనా సరే! అన్నీ – మహర్షుల అంశాలే! అన్నమాచార్యుల వారు చెప్పులు వదలిచూస్తే వారికి పర్వత దివ్యదర్శనమైంది. రామానుజాచార్యుల వారు కొండ అంతా సాలగ్రామ శిలలు కాబట్టి పాదాలతో కొండను తొక్కడం ఇష్టంలేక- పాదాలు, మడిచి, మోకాళ్ళను తాళ్ళతో కట్టుకుని, దేకుతూ పైకి ఎక్కారు.

**ఏడుకొండలలో మొదటిది వృష భాద్రి** – వృషభమంటే ఎద్దు. చూడడానికి ఆ కొండ ఒకఎద్దు ఉన్నట్లుగా ఉంటుంది. వృషభానికి ఋగ్వేదంలో ఒక సంకేతం ఉంది.

**చత్వారిశృంగా త్రయో అస్యపాదా ద్వే**
**శీర్షే సప్తహస్తాసో అస్య**
**త్రిధా బద్ధో వృషభో రోరవీతి**
**మహా దేవో మర్త్యాగ్ం ఆవివేశ ॥**

నాలుగు కొమ్ములుంటాయి. మూడుపాదాలుంటాయి. రెండుతలలు, ఏడుచేతులు, మూడుచోట్ల కట్టబడుతుంది. పరమశివుడు అటువంటి నందీశ్వరుని మీద కూర్చుని వస్తాడు. నిజానికి నందీ శ్వరుడలా ఉంటాడని కాదు. శబ్దానికి సంకేతం–నాలుగుకొమ్ములు అంటే 'పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ' అని మాట నాలుగురకాలుగా ఉంటుంది. నిర్వికల్ప సమాధిలో ఉంటే పరావాక్కు వినబడు తుంది. నిర్వికల్పసమాధిలో ఉంటే పశ్యంతీవాక్కు వినబడుతుంది. ఎవరికి వారికి లోపలే వినపడే వాక్కుకు మధ్యమా అని పేరు. పైకి వినపడే వాక్కుకు వైఖరి అని పేరు. మూడుపాదాలచేత నడు స్తుంది – అదే భూత, భవిష్య, వర్తమాన

కాలాలు. కార్యశబ్దం, కారణశబ్దమని రెండు తలలు. చేతులు ఇచ్చి పుచ్చుకోవడానికి- పదాలచేత వాక్యనిర్మాణానికి అను సంధానం చేస్తాయి. ఏడువిభక్తులచేత శబ్దం నిర్వహించబడు తుంది. వాక్కు హృదయంలో, నాభిలో, శిరస్సులో బంధించబడు తుంది. అటువంటి వాక్కును అధిరోహించి, పరమాత్మ వస్తు న్నాడు.

వాక్కు అనగా శబ్దం. శబ్దం - అంటే వేదం. ఆ వేదమే ప్రమాణం. ఇతరాలు ప్రమాణం కావు. కంటితో చూచి చెపుతున్నవి, నిజం కానివి ఎన్నో ఉన్నాయి. ఉదయించడం, అస్తమించడం లేని సూర్యుణ్ణీ, చంద్రుణ్ణీ చూడటం కుదరదు. సూర్యునిచుట్టూ భూమి తిరగడంలో, తిరగని సూర్యునికి అభి ముఖంగా లేని ప్రాంతానికి చీకటి పడింది. తిరగని సూర్యునిలో చలనత్వాన్ని ఆరోపించి, తిరుగుతున్న భూమికి అచలత్వాన్ని ఆరోపిస్తున్నాము. పొగమంచును చూచి, పొగ అంటున్నారు. ఎర్రదనం చూచి, మంట అంటున్నారు. కన్ను భ్రాంతికి లోనైంది కదా! చూచిందల్లా కంటికి ప్రమాణమని అంటే కుదరదు. వేదప్రమాణాన్ని అంగీకరిస్తే మొదటికొండ ఎక్కుతారు.

**రెండవది వృషాద్రి-** వృషాద్రి అంటే ధర్మం. వేదంలో పూర్వభాగమంతా ధర్మంగురించి చెపుతుంది. మనం నిర్వర్తించ వలసిన విధికి ధర్మమని పేరు. వేదం కొన్నిధర్మాలు చెప్పి, వాటిని నిర్వర్తించమని చెప్పింది.

అవి చేస్తే ఇహంలో సుఖంగా ఉండి పరలోకంలో సుఖం పొందుతారు. అటువంటి కర్మలను, ధర్మాలను నిర్దే శించిన విషయాలను తెలుసుకుని, అనుష్ఠానం లోకి తీసుకుని రావడమే వృషభాద్రి. వృషాద్రి, వృషభాద్రి దాటితే **మూడవది గరుడాద్రి.**

గరుడుడు అనగా పక్షి. పక్షి ఆకాశంలో ఎగురుతుంది. ఎక్కడో ఆకాశంలో ఎగురుతున్న గద్ద- కింద ఎంతో జాగ్రత్తగా తిండి తింటూకూడా కోడి చూసుకుంటున్న కోడిపిల్ల, తల్లి రెక్కలనుంచి కించిత్తు దూరమైతే దానిమీద దృష్టి పెట్టి, అంత పైనుండీ వాయువేగంతో వచ్చి, తన రెండు కాళ్ళతో కోడిపిల్లను ఎత్తుకుని దూరంగా ఎగిరిపోతుంది. అటువంటి సమ్యక్ దృష్టితో ఉంటాడు-గరుడుడు.

అనగా ఉపనిషత్ జ్ఞానం పొందడం. 'షద్' అంటే జీర్ణం కానిది. జీర్ణం కాని దానిని 'ఉప' అనగా సమీపానికి తీసుకుని వెడుతుంది. ఒక్క పరబ్రహ్మం జీర్ణమవదు. మిగిలిన వాటన్నిటికీ ఆరువికారాలు ఉంటాయి. పుట్టింది, ఉంది, పెరిగింది, మార్పుచెందింది, తరిగింది, నశించిపోయింది. ఈ ఆరూ లేనివాడు కనకనే ఆయనకు ఇంకో పేరు లేదు- భగవన్ అనేదే ఆయన పేరు.

ఐశ్వర్య బలాలు, జ్ఞానశక్తి వీర్యతేజస్సులు ఉన్నవాడు- కల్యాణగుణ సహితుడు, హేయగుణరహితుడు కనక ఆయన భగవానుడు. ఆయనను జ్ఞానంచేత తెలుసుకోవడం గరుడాద్రి.

**నాలుగవది అంజనాద్రి-** అంజనమంటే కంటికాటుక. కంటికి అందంకొరకు, చలువ కలగడంకొరకు కాటుకపెట్టు కుంటారు. కంటితో చూడవలసిన వస్తువిశేషాలనుమాత్రమే చూడడం కాక, చూడబడే ప్రపంచమంతటికీ అధిష్ఠానమైన బ్రహ్మాన్ని చూడకలిగిన లోచూపు కలగడం కంటికి కాటుక. ఇన్ని రూపాలుగా కనపడుతున్నది ఇన్ని కాదు.

**అంతర్బహి శ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః**

ఇదంతా కేవలం ఒక్క పరమాత్మ అని తెలుసుకోగలిగిన లోచూపు ఏర్పడితే, కంటికి అంజనం పెట్టుకున్నట్లు. **అంజ నాద్రి ఎక్కి శేషాద్రికి వెడతారు.**

ప్రపంచమంతటినీ భగవన్మ యంగా చూచే స్థితి వస్తే, వారికి రాగద్వేషాలు, క్రోధం, శత్రుత్వం ఉండవు.

భగవద్గీతలో స్వామి అంటాడు-

**తుల్యనిందా స్తుతి ర్మౌని సంతుష్టో యేన కేన చిత్**
**అనికేతః స్థిరమతిః భక్తిమాన్ మే ప్రియో నరః**

బ్రహ్మం తప్ప వేరొకటి లేదు అన్నవారికి భయం ఉండదు. తాను కాకుండా ఇంకొకటి ఉన్నదంటే దానివలన ఏదో ఉంటుందని భయం.

బ్రహ్మంగా నిలబడినవారికి బ్రహ్మంగా అవతలివారి భావన తెలుస్తుంది. బ్రహ్మంతో తాదాత్మ్యం తెలుసుకున్నవాడు లోకం కష్టసుఖాలు తెలుసుకుంటాడు. శుకాదులు – ఈ బ్రహ్మ స్థితిని పొందినవాళ్లు.

**సర్వం బ్రహ్మమయం జగత్.**

అన్నిటిలోనూ బ్రహ్మమే. ఇంకోవస్తువు ఉండదు. ఒక్కటే వస్తువు.

**చిదానందరూప శ్శివోஉహం శివోஉహం**

ఎప్పుడూ ఒక్కలా ఉండగలిగినవాడు బ్రహ్మం. అటువంటి స్థితిని పొందినవారు మహాపురుషులు. ఆ స్థితికి ఎదగగలిగితే అంజనాద్రి చేరుకున్నట్లు. దాటితే **వేంకటాద్రి**. అంటే పాపాలు తొలగిపోతాయి. తాను చేస్తున్నదేదీ లేదు. అంతా బ్రహ్మమే చేస్తున్నాడు. బ్రహ్మమే చేయించుకుంటున్నాడు.

పూర్వకాలంలో ఒక సన్యాసి ఉండేవారు. ఆయనకు ఆకలి వేస్తే– ఏదో రోగం వచ్చినట్లుగా అనిపించేది. జ్ఞానం కలిగినవారు గనక ఆకలిని క్షుద్బాధ అని పిలుస్తారు. బాధ కలిగినప్పుడు లోపల పదార్థాన్ని పడవేస్తాడు. రుచి గురించి తాపత్రయపడడు.

ఒక మురికికుండీవద్ద కూర్చుని ఎవరో పారవేసిన పదార్థాన్ని కుక్కలు తింటుంటే, వాటితోపాటు పదార్థాలను చేతిలో పెట్టుకుని తింటున్నాడు. దోవన వెళుతూ చూచిన వాళ్ళు–ఆయనకు పెద్దసన్యాసి అని నమస్కరిస్తాం అనుకొని, దగ్గరకు వెళ్లి, ఆయన పారవేసిన అన్నాన్ని కుక్కలతో కలిసి తింటున్నాడని, వెళ్ళి "మీరు చేస్తున్న దేమిటి? మీరు చేస్తున్నది మీకు తెలుస్తున్నదా?" అని అడిగారు.

కుక్కల రూపంగా ఉన్న బ్రహ్మంతో బ్రహ్మం కలిసి అన్నం తింటున్నది ఈ శరీరం అనబడే బ్రహ్మం బ్రహ్మంగా నిలబడి బ్రహ్మంగా ఆనందం పొందుతున్నది" అన్నాడు.

ఆయన స్థితి మనకు అర్థం కాకపోతే ఏవో పిచ్చి మాటలను కుంటాము. లోకంలో బాగా జ్ఞానం పొందినవాళ్ళు పిచ్చివాళ్ళలా కనపడతారు. జ్ఞాని, పిచ్చివాడు ఒకలా ఉంటారు. పరమశివునికి ఉన్మత్తశేఖరుడని అని పేరు. ఉన్మత్తుడు అంటే పిచ్చివాడని అర్థం. పిచ్చివాళ్ళల్లో శేఖరుడు అని పేరు. అంటే పరమశివుడు పిచ్చివాడని అర్థం కాదు. అంతటిజ్ఞాని అని అర్థం. ఆయన జ్ఞానగంగాధరుడు. అటువంటి స్థితిని పొందటం వేంకటాద్రి. వారికి పాపం పుణ్యాలుండవు.

**నారాయణాద్రి చివరిది.** అనగా తురీయ అవస్థను దాటి, తానే బ్రహ్మంగా నిలబడిపోతాడు. అటువంటి స్థితిని పొందటం నారాయణాద్రి. వేంకటాచలంలోని ఏడు కొండలు ఎక్కడం వెనకాల ఇంత రహస్యాన్ని చిత్రంగా నిక్షేపించారు. వేంకటాచలమనేసరికి మనకు జ్ఞాపకం వచ్చేది స్టేషనులోకి వెళ్ళి, రైలెక్కి వెళ్ళి, బస్సు ఎక్కి ఏడుకొండలు ఎక్కడం, కాటేజీలోకి వెళ్ళి స్నానం చేసి, ఆనందనిలయంలోకి వెళ్ళి, స్వామికి ఒక నమస్కారం చేసి బయటికి వచ్చేయడం.

*(ఇంకా ఉంది)*



**శ్రీరామకోటి లేఖన విధివిధానాలు తెల్పప్రార్థన?**

**- ఆర్.తులసీరామ్, చౌడేపల్లె.**



'శ్రీరామ' అనే నామాన్ని కోటిమార్లు వ్రాయడాన్ని 'శ్రీరామకోటి' అంటారు. శ్రీరామనామకోటి వ్రాయడానికి మానవులందరికీ అర్హత ఉంది. వ్రాయడంలో ముఖ్యమైనవి- శ్రద్ధ, భక్తి అనేవి. 'రామకోటి' వ్రాసేటప్పుడు అనవసర మైన మాటలు, దిక్కులు చూడడం తగదు. 'శ్రీరామ' అని ఒక్కమారు వ్రాసే సమయంలో రెండుమార్లు మనస్సులో స్మరిస్తూ, నోటితో 'శ్రీరామ శ్రీరామ' అంటూ రెండుమార్లు మెల్లగ ఉచ్చరిస్తూ వ్రాయాలి. శ్రీరామదేవునికి మనః పూర్వకంగా నమస్కారం చేసి, వ్రాయడం మొదలుపెట్టాలి. శుచిశుభ్రతలు కల్గి ఉండాలి. మాసినవస్త్రాలతో, ముందు రోజు కట్టుకొన్నవస్త్రాలతో ఉండి వ్రాయరాదు. ఉగాదికి, ఆరవేసిన వస్త్రాలు ధరించి, వ్రాయాలి. ప్రతిపుటకు పైన **"శ్రీరామశ్శరణం మమ"** అనీ, పుటక్రింద

**ఆపదా మపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।**
**లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్ ॥**

- అనీ వ్రాయాలి. మనస్సును రామ నామంపై ఏకాగ్రంచేసి వ్రాయాలి. ప్రతివారం కానీ, పక్షానికి ఒక మారుగానీ, లేదా ప్రతి మాసంలో శుద్ధనవమి/పునర్వసు నక్షత్రంనాడు కానీ వారి వారి శక్తికి తగినట్లు యోగ్యులైన వారికి అన్నం పెట్టాలి.

ఒక్కొక్క పుస్తకం పూర్తి కాగానే, పుస్తకాన్ని పూజించి, ఒక పెట్టెలో పెట్టి, అప్పుడప్పుడు కొద్దిగా హారతి కర్పూరం పొడి పుస్తకంపై చల్లుతుండాలి. ఇందువల్ల పుస్తకాలకు చెదలు, చీమలు పట్టకుండా ఉంటుంది. పండుగ రోజులలో శుచిగా ఉండి, ఆ పుస్తకాలకు హారతికూడా ఈయవచ్చు. సాక్షాత్తు శ్రీరాముడే నామలేఖనపుస్తకరూపంలో ఉన్నాడని భావించాలి. పేరుకూ, పేరుకలవానికీ భేదంలేదని శాస్త్రం! ఒకవేళ కోటివ్రాయలేకపోతే - వ్రాసినన్ని పుస్తకాలు పుణ్య క్షేత్రాలలో, శ్రీరామాలయాలలో 'రామకోటి పుస్తకాలు' భద్రపరచే అవకాశం ఉన్నచోట ఉంచవచ్చు.

నేలపై కూర్చొని, పరుండీ వ్రాయరాదు. పద్మా సనంగా కూర్చొనే వ్రాయాలి. సాయంకాలం స్నానంచేసి, భోజనానికి ముందే వ్రాయడం మంచిపద్ధతి. రామకోటి వ్రాయడానికే ప్రత్యేకంగా గీతలు ముద్రించిన పుస్తకాలు ప్రస్తుతం లభిస్తున్నాయి కనుక - వాటిల్ని కొని, కొట్టివేతలు లేకుండా వ్రాయాలి. రోజూ అవకాశం ఉండి, నియమంగా వ్రాస్తే - మూడున్నర సంవత్సరాలలో కోటి వ్రాయవచ్చు. చాలామంది వ్రాశారుకూడా! కోటి పూర్తి అయినా - కొందరు జీవితపర్యంతం వ్రాసే వారూ ఉన్నారు. ఎక్కువ వ్రాస్తే ఫలంకూడా ఎక్కువేకదా! చంచలమైన మనస్సును ఏకాగ్రం చేయడానికీ, సద్విషయాలలో సంచరించడానికి 'నామకోటి' లేఖనం చక్కగా ఉపకరిస్తుంది. ఇందులో భక్తి అత్యంతముఖ్యం.

**శ్రీరామకోటిని పునర్వసునక్షత్రం నాడు ప్రారంభించి, పునర్వసునక్షత్రం నాడే ముగింపు చేస్తే మంచిది.**

నల్లరంగులో వ్రాయరాదు. నీలం, ఆకు పచ్చరంగులు వాడవచ్చు. ఇలా వ్రాయగా వ్రాయగా క్రమంగా ఇహలోకసుఖాలపై కోరికలు తగ్గి, పారమార్థిక విషయాలపై ఆసక్తి పెరుగుతుంది.

అలా పారమార్థికచింతన కుదరకపోతే - ఆ వ్యక్తికి భక్తి, ఏకాగ్రత చేకూరలేదనే భావించాలి. ఇతరుల తృప్తి కొరకూ, తన తృప్తికొరకూ కాక, శ్రీరామచంద్రునిప్రీతికే వ్రాస్తున్నానని భావించి, వ్రాయాలి. కర్మఫలాన్ని రామునికే అర్పించాలి. కోటి పూర్తి అయ్యాక అన్ని పుస్తకాలు ఒక రామాలయంలో ఉంచి, అక్కడి మూలమూర్తులకు అభిషేక పూజాదులు నిర్వహించి, పుస్తకాలనూ పూజించాలి.

ఆనాడు అన్నసంతర్పణ చేయడం మంచిది. అంటు, మైల, పురుడు ఉన్న రోజులలో వ్రాయరాదు. పునర్వ సునక్షత్రంనాడు ప్రారంభించి, పునర్వసునక్షత్రం నాడే ముగింపు చేస్తే మంచిది.




డా॥ చిన్నలక్ష్మీ కళావతి, 99633 39301

**అందరూ 'రామరాజ్యం రామరాజ్యం' అని ప్రశంసిస్తుంటారు కదా! రామరాజ్యంలోని విశిష్టతలు ఏవి?**

– పి.కనకమ్మ, తిరుపతి.



ఏ దేశం అయినా – సుభిక్షంగా ఉండి, ధర్మం, న్యాయం సక్రమంగా పాటింపబడుతూండి, అందరూ ఏ దుఃఖాలూ లేక సుఖశాంతులతో ఉంటే– ఆ రాజ్యాన్ని 'రామ రాజ్యం' అనడం వింటున్నాం. శ్రీరాముడు ధర్మయుతంగా పదకొండువేల సంవత్సరాలు రాజ్యం పరిపాలించాడు. ఆ సమయంలో ప్రజలందరూ క్షేమంగా– సత్యవాక్కులూ, ధర్మ ప్రవర్తనలూ అయి ఉండేవాళ్లు. అయోధ్యారాజ్యంలో దుశ్చే ష్టులూ, దరిద్రులూ, క్రూరులూ, అవిద్యావంతులూ, నాస్తి కులూ కన్పించరు. స్త్రీపురుషులందరూ సచ్ఛీలురై, సదాచార వంతులై, ప్రసన్నమనస్కులై మహర్షులవలె పవిత్రజీవనులై ఉండేవాళ్లు. రాముని రాజ్యపాలనకాలంలో భర్తను కోల్పోయిన స్త్రీల ఆర్తనాదాలు లేవు. క్రూరజంతువులవల్ల, జీవులవల్ల బాధలు లేవు. రోగాలు దరిచేరవు. దొంగ తనాలూ, దోపిడీలు లేవు. వృద్ధులకు బాలకులచే అంత్య క్రియలు జరపాల్సిన పరిస్థితి లేదు.

అందరూ శ్రీరాముణ్ణి ఒక చక్రవర్తిగా కాక – భగ వంతుడనే భావనతో–రామనామస్మరణతో జీవనం గడిపే వాళ్లు. **"రామో రామో రామ ఇతి ప్రజానా మభవన్ కథాః। రామ భూతం జగదభూత్ రామే రాజ్యం ప్రశాసతి"** (వాల్మీకిరామా యణం) ఎక్కడ చూచినా రామకథామృతపానమే! 'సర్వం రామమయం జగత్' అయింది అన్ని ఓషధులు లెస్సగా లభించేవి. అందరూ పూర్ణాయుష్కులే అయ్యేవాళ్లు. సకాలంలో వర్షాలు కురిసేవి. ఇలా రామునిరాజ్యపాలనలో అందరూ ఉత్తమ, పవిత్రజీవనంతో, సుఖశాంతులతో వర్ధి ల్లారు కనుకనే నేటికీ అలాంటి 'రామరాజ్యం' కావాలని కోరుకొంటున్నాము. వస్తుందని ఆశిద్దాం!!

**హనుమంతుడు లంకను దొడ్డిదారిగుండా ఎందుకు ప్రవేశించాడు?**

– జి.బాలసుబ్రహ్మణ్యం, హిందూపురం.



హనుమంతుడు సీతాన్వేషణకై సముద్రం దాటివచ్చి, లంకను సమీపించాడు. ప్రవేశద్వారం గుండాకాక – ప్రాకారం నుంచీ దుమికి, ఎడమకాలుపెట్టి లోనికి ప్రవేశిం చాడు. 'అద్వారంగుండా నగరం, గ్రామం, ఇల్లు ప్రవేశించ రాదు' అనే నియమం సామాన్యం. అది మిత్రులు, బంధు వులు, మనశ్రేయస్సు కోరేవాళ్ల విషయంలో అద్వారప్రవేశం అధర్మమే! కానీ ధర్మశాస్త్రాలు, "అద్వారేణ విశేత్ శత్రోః పురం, గ్రామం, గృహం తథా" అన్నాయి. కనుక శత్రువుల నగరాన్ని, గ్రామాన్ని, ఇంటినీ ప్రవేశించేటప్పుడు 'అద్వారం' గుండానే వెళ్లాలన్నారు. గృహప్రవేశకాలంలో, వివాహ కాలంలో కుడికాలు ముందుపెట్టి, ప్రధానద్వారంగుండానే వెళ్లాలి. శత్రువుల ఇండ్లకూ, గ్రామాలకూ, నగరాలకయితే అద్వారంకుండా ఎడమకాలు ముందుపెట్టి ప్రవేశించాలని పెద్దలు సూచించారు. భారతంలో కృష్ణుడు, భీముడూ జరాసంధునిమందిరాన్ని అద్వారంద్వారానే ప్రవేశించారు. జరాసంధుడు "ఇలా అద్వారంలో ఎందుకు వచ్చా"రని ప్రశ్నించాడు. అందుకు కృష్ణుడుకూడా ఇదే నీతినే సమాధానంగా చెప్పాడు.



రావణుడు హనుమంతునికి ప్రత్యక్ష శత్రువుకాక పోయినా – తన ప్రభువైన రామునికి శత్రువైనందున – తనకూ శత్రువే అవుతాడు. కనుకనే ధర్మమూ, ధర్మ సూక్ష్మాలూ చక్కగా తెలిసిన హనుమంతునికి – ఇలా ప్రవే శించుమని ఎవ్వరూ సూచించకపోయినా – అతడుమాత్రం స్మృతివాక్యాన్ని స్మృతికి తెచ్చుకొని, అద్వారాన్నే ఎంచు కొన్నాడు. ఇది శత్రునాశనానికి సంకేతం!



# చిన్న అద్దంలో..



-శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు, 99896 79681

శ్రీరామానుజులవారిది చాలా సుదీర్ఘ చరిత్ర.
వారు జీవితకాలంలో ఎన్నెన్నో
మహత్తర కార్యాలు నిర్వహించి,
విశిష్టాద్వైతాన్ని సుప్రతిష్ఠం చేశారు.
వీరి జీవితాన్ని సమగ్రంగా దర్శిస్తే
కొన్ని సంపుటాలవుతుంది.
అన్ని సంపుటాలచరిత్రను
ఒక పుటలో చెప్పటం -
మహాసాగరాన్ని మరచెంబులో అందించడం.
శ్రీరామానుజులవారి జీవితముఖ్యసంఘటనలను
రేఖామాత్రంగా చిన్నిఅద్దంలో
పెద్దకొండను చూడడం...

**జననం** : క్రీ.శ. 1017,

**వివాహం** : క్రీ.శ. 1033 (16వ ఏట),

**గృహస్థుడుగా (కాంచీపురంలో)** : క్రీ.శ. 1034 నుండి 1049 వరకు,

**సన్యాసస్వీకారం:**
కాంచీపురం-వరదరాజసన్నిధిలో క్రీ.శ. 1049 (32వ ఏట),

**శ్రీరంగప్రథమప్రవేశం** : క్రీ.శ. 1042,

**యామునుల అంగుళి ఆజ్ఞలు స్వీకారం** : క్రీ.శ. 1049,

**యతిరాజమఠస్థాపనం** : క్రీ.శ. 1093,

**కర్ణాటకకువెళ్లడం** : క్రీ.శ. 1096,

**హొయసల(కర్నాటక)రాజును వైష్ణవునిగామార్చడం:**
క్రీ.శ. 1098,

**మేలుకోటతిరునారాయణస్వామివారిప్రతిష్ఠ** : క్రీ.శ. 1100,

**మేలుకోటలో పూజావ్యవస్థను క్రమబద్ధీకరణ** : 1110,

**మేలుకోటలో ఉన్నది** :
1096-1118 (కర్ణాటకలో ఉండినకాలం 22 ఏండ్లు),

**కర్ణాటకనుండి శ్రీరంగానికి తిరిగివచ్చింది** : 1118,

**పరమపదం వేంచేసినది** : క్రీ.శ. 1137.

**వ్యవహారనామాలు** :

**ఇలయాళ్వారులు** - తండ్రిపెట్టినపేరు,

**రామానుజ** - పంచసంస్కారకాలానదాస్యనామం,

**రామానుజనంబి** - కురంగ నగరీపూర్ణ ప్రసాదలబ్ధం,

**యతిరాజు** - తుర్యాశ్రమానంతరం దేవరాజలబ్ధం,

**లక్ష్మణముని** - తిరువరంగగురుప్రసాదలబ్ధం,

**శఠకోపపొన్నడి** - కూరమాలాధరగురుకరుణాలబ్ధం,

**కోయిలణ్ణన్** - తిరుమలనంబి అనుగ్రహించినది,

**భూతపురీశ** - ఆదికేశవ ప్రసాదలబ్ధం,

**దేశికేంద్ర** - శ్రీవేంకటేశానుగ్రహప్రాప్తం,

**ఎంబెరుమానారు** - గోష్ఠీపూర్ణ అనుగ్రహప్రాప్తం,

**భాష్యకార** - కాశ్మీరంలో వాగ్దేవీవరప్రసాదలబ్ధం- అక్కడి పండితులు భారతీశోకనాశను దని కీర్తించారు,

**ఉడయవరులు** - గద్యత్రయరచనానంతరం శ్రీరంగనాథులు అనుగ్రహించినది.

**అవతారాలు** : అనంత, లక్ష్మణ, బలభద్ర, రామానుజ.

**జన్మస్థలం** : శ్రీపెరుంబుదూరు / భూతపురి.

**కుటుంబం-బంధువులు:**

**ఇంటిపేరు** - ఆసూరి,
**గోత్రం** - హరిత,
**సూత్రం** - ఆపస్తంభ,
**శాఖ** - యజుశ్శాఖ,
**తల్లి** - భూమిపిరాట్టి/కాంతిమతి,
**తండ్రి** - కేశవసోమయాజి,
**భార్య** - తంజమాంబ/రక్షకాంబ,
**మేనమామ** - తిరుమలనంబి/శ్రీశైలపూర్ణ,
**పినతల్లి (తల్లిచెల్లి)** - ద్యుతిమతి/పెరియపిరాట్టి,
**పినతల్లిభర్త** - మధురమంగళవాసి కమలనయనభట్టు,
**పినతల్లి కొడుకు** - గోవిందమిశ్రులు,

**పెరుమాళ్లతోచుట్టరికం:**

శ్రీవేంకటేశునకుగురువు,మామ; సంపత్కుమారునకు తండ్రి; గోదాదేవికి అన్న; శ్రీరంగనాథునకు మంత్రి; తిరుక్కురుంగుడినంబికి గురువు.

**గురువులు:**

**యాదవప్రకాశులు** - అద్వైతవేదాంతం-కాంచీపురం,

**శ్రీశైలపూర్ణులు/తిరుమలనంబి** - రామాయణరహస్యార్థబోధకులు,

**మహాపూర్ణులు/పెరియనంబి** - పంచసంస్కారప్రదాత, అర్థపంచకబోధకులు,

**గోష్ఠీపూర్ణులు తిరుక్కొట్టియూర్‌నంబి**- అష్టాక్షరీమంత్రోపదేశకులు,

**మాలాధారులు** - తిరువాయ్‌మొళి అధ్యయనం,

**వరరంగాచార్య** - వేదాంత విషయాలు, పెరియతిరుమొళి, కణ్ణినుణ్‌శిరుత్తాంబు వ్యాఖ్యానాన్ని పొందారు;

**ఆళ్వందాన్ ఆళ్వాన్** - తిరువాయ్‌మొళి, ప్రాచీనసంప్రదాయాలు;

**తిరుక్కచ్చినంబి/కాంచీపూర్ణ** - షడ్వార్థలు తెలిపారు (రామానుజులు గురువుగా గౌరవించారు, నంబిమాత్రం గురువుగా అంగీకరించలేదు).

**ప్రముఖశిష్యులు** :

కూరేశ, దాశరథి, కిడాంబి ఆచ్చాన్, వడుగనంబి/ఆంధ్రపూర్ణ, తిరువరంగత్తముదనార్, తిరుక్కళై, హైపిరాన్ పిళ్ళై, నడాదూర్ ఆళ్వాన్ మొదలైనవారు.

**పర్యటించిన స్థలాలు/దిగ్విజయయాత్ర** :

మొదట దక్షిణభారతదేశం తర్వాత ఉత్తరభారతదేశం యాత్రచేసి పరమతాలవారివాదాలను పరాస్తంచేసి విశిష్టాద్వైతాన్ని స్థాపించారు. అనేక దివ్యస్థలాలు సందర్శించి తిరుమల, మేలుకోట మొదలయినచోట్ల విశేషంగా కొన్ని కట్టుదిట్టమైన కైంకర్యసంబంధితమైన ఏర్పాట్లు చేశారు.

**పరివారం** :

ఉత్తమాశ్రమయతులు 700. వీరిలో స్త్రీలుకూడా ఉన్నారు. వారు అమ్మైయార్లు, దేవియార్లు, నాచ్చియార్లు వీరికి వ్యవహారం. ఆచార్యపీఠాలు (సింహాసనాధిపతులు) 74, ఏకాంత సేవకులు (ఏకాంగులు) 12000, కొత్తెమ్మలు-ఇతర స్త్రీలు= 3000, ఆచార్యపురుషులు 173, చాతనిదాసులు=అసంఖ్యాకులు, శిష్యవర్గం= కులమతజాతిభేదాలకు అతీతంగా- రాజులు మొదలుకొని సామాన్య ప్రజలవరకు దాసానుదాస వర్గంలో ఉన్నారు.

**రచనలు** :

శ్రీభాష్యం, వేదార్థసంగ్రహం, వేదాంతదీపం, వేదాంత సారం, గద్యత్రయం (శరణాగతి, శ్రీరంగ, వైకుంఠగద్యలు), నిత్యగ్రంథ - ఇవన్నీ సంస్కృత రచనలు. తమిళంలో కొన్ని తనియన్లు.

**విప్లవాత్మకచర్యలు** :

ఆనాడు పంచములని పిలువబడేవారికి మేలుకోటలో ఆలయప్రవేశం కల్గించారు. అన్ని కులాలవారికి పంచ సంస్కారంపొందే అర్హత ఉందని తెలిపి, జరిపించారు. గోప్య తిరుమంత్రాన్ని గోపురం ఎక్కి అందరకూ వినిపించి వారికి మంత్రోపదేశం బహిరంగంగా చేశారు.

**సందేశం** :

జాతికన్న భక్తికేప్రాధాన్యం మిన్న. శరణాగతియే మోక్షోపాయం.

**మంగళం యతిరాజాయ మహనీయగుణాత్మనే**
**భక్తలోక శరణ్యాయ భాష్యకారాయ మంగళమ్.**



©ttd photo

## ఒంటిమిట్ట శ్రీ కోదండరామస్వామి వారి బ్రహ్మోత్సవాలు

**2016, ఏప్రిల్ 14 నుండి 23 వరకు**

| తేదీలు | పగలు ఉత్సవం | రాత్రి ఉత్సవం |
|---|---|---|
| 14-04-16 | న్యాసాభిషేకం | అంకురార్పణం |
| 15-04-16 | ధ్వజారోహణం | శేషవాహనం |
| 16-04-16 | వేణుగానాలంకారం | హంసవాహనం |
| 17-04-16 | వటపత్రశాయి అలంకారము | సింహవాహనం |
| 18-04-16 | నవనీత కృష్ణాలంకారం | హనుమత్సేవ |
| 19-04-16 | మోహినీ సేవ | గరుడ సేవ |
| 20-04-16 | శివధనుర్బాణాలంకారం | ఎదుర్కోలు, కల్యాణోత్సవం, గజవాహనం |
| 21-04-16 | రథోత్సవం | --- |
| 22-04-16 | కాళీయమర్దనాలంకారం | అశ్వవాహనం |
| 23-04-16 | చక్రతీర్థం | ధ్వజావరోహణం |



## తిరుపతి శ్రీ కోదండరామస్వామి వారి బ్రహ్మోత్సవాలు

**2016, ఏప్రిల్ 03 నుండి 12 వరకు**

| తేదీలు | పగలు ఉత్సవం | రాత్రి ఉత్సవం |
|---|---|---|
| 03-04-16 | --- | అంకురార్పణం |
| 04-04-16 | ధ్వజారోహణం | పెద్దశేషవాహనం |
| 05-04-16 | చిన్నశేషవాహనం | హంసవాహనం |
| 06-04-16 | సింహవాహనం | ముత్యపుపందిరివాహనం |
| 07-04-16 | కల్పవృక్షవాహనం | సర్వభూపాల వాహనం |
| 08-04-16 | పల్లకిలో మోహినీ అవతారోత్సవం | గరుడ వాహనం |
| 09-04-16 | హనుమద్వాహనం, సా॥ వసంతోత్సవం | గజవాహనం |
| 10-04-16 | సూర్యప్రభవాహనం | చంద్రప్రభవాహనం |
| 11-04-16 | రథోత్సవం | అశ్వవాహనం |
| 12-04-16 | చక్రస్నానం | ధ్వజావరోహణోత్సవం |

## వాయల్పాడు శ్రీ పట్టాభిరామస్వామి వారి బ్రహ్మోత్సవాలు

**2016, ఏప్రిల్ 12 నుండి 21 వరకు**

| తేదీలు | పగలు ఉత్సవం | రాత్రి ఉత్సవం |
|---|---|---|
| 12-04-16 | --- | అంకురార్పణం |
| 13-04-16 | ధ్వజారోహణం | --- |
| 14-04-16 | చిన్నశేషవాహనం | హంసవాహనం |
| 15-04-16 | సింహవాహనం | ముత్యపుపందిరివాహనం |
| 16-04-16 | కల్పవృక్షవాహనం | సర్వభూపాలవాహనం |
| 17-04-16 | పల్లకిలో మోహినీ అవతారోత్సవం | గరుడవాహనం |
| 18-04-16 | హనుమద్వాహనం, సా॥ వసంతోత్సవం | గజవాహనం |
| 19-04-16 | సూర్యప్రభవాహనం | చంద్రప్రభవాహనం |
| 20-04-16 | రథోత్సవం | అశ్వవాహనం |
| 21-04-16 | చక్రస్నానం | ధ్వజావరోహణోత్సవం |



నాగులాపురం

# శ్రీ వేదవల్లీ సమేత శ్రీవేదనారాయణస్వామి వారి బ్రహ్మోత్సవాలు

## 2016, ఏప్రిల్ 21 నుండి 30 వరకు

| తేదీలు | పగలు ఉత్సవం | రాత్రి ఉత్సవం |
|---|---|---|
| 21-04-16 | --- | అంకురార్పణం |
| 22-04-16 | ధ్వజారోహణం | పెద్దశేషవాహనం |
| 23-04-16 | చిన్నశేషవాహనం | హంసవాహనం |
| 24-04-16 | సింహవాహనం | ముత్యపుపందిరివాహనం |
| 25-04-16 | కల్పవృక్షవాహనం | సర్వభూపాలవాహనం |
| 26-04-16 | పల్లకిలో మోహినీ అవతారోత్సవం | గరుడవాహనం |
| 27-04-16 | హనుమద్వాహనం సా॥ వసంతోత్సవం | గజవాహనం |
| 28-04-16 | సూర్యప్రభవాహనం | చంద్రప్రభవాహనం |
| 29-04-16 | రథోత్సవం | అశ్వవాహనం |
| 30-04-16 | చక్రస్నానం | ధ్వజావరోహణోత్సవం |



ఆదర్శపురుషుడు

పచ్చతోరణం

# తాళ్లపాక అన్నమాచార్యుడు



– డా॥ అద్దంకి శ్రీనివాస్

ఆధ్యాత్మికచింతనకు నిలయమైన భారతదేశంలో విశ్వశ్రేయస్సును ఆకాంక్షిస్తూ ఎందరో మహానుభావులు తమ బోధనాసుధామాధురీఝరులతో ప్రజలను పవిత్రులను చేస్తూ పరమాత్మతత్త్వాన్ని బోధిస్తూ వచ్చారు. కర్మ, భక్తి జ్ఞాన యోగ మార్గాలలో తరగని ఆధ్యాత్మికసంపదను అందించారు. అటువంటి మహానుభావులలో తాళ్ళపాక అన్నమాచార్యులు ఒకరు. తాళ్లపాక అన్నమాచార్యులు పదకవితాపితామహుడు. సంకీర్తనా చార్యుడు. దక్షిణాపథంలో సంకీర్తనాసంప్రదాయానికి, పదకవితాశైలికి ఆద్యుడు. వైష్ణవభక్తుడు. సంకీర్తనలలో భక్తి, సాహిత్యం, సంగీతం, శృంగారం, భావలాలిత్యం పెనవేసి కొనేలా తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామిని, అహోబిలంలోని శ్రీనరసింహస్వామిని, ఇంకా దివ్యక్షేత్రాలలోని దేవతలను కీర్తిస్తూ 32 వేలకు పైగా కీర్తనలు రచించాడు. **చందమామ రావే జాబిల్లి రావే , జోఅచ్యుతానంద జో జో ముకుందా –** అంటూ తన పాటలతో తెలుగు సంస్కృతికి పట్టం కట్టి, జనాలనోళ్లలో నాటుకొని పోయేలా సంకీర్తనాభాండాగారాన్ని రచించిన పదకవితాపితామహుడు తాళ్లపాక అన్నమాచార్యులు.

## నందవరీక బ్రాహ్మణులు

అన్నమయ్య నందవరీక బ్రాహ్మణ కుటుంబానికి చెందినవాడు. భారద్వాజగోత్రుడు. ఆశ్వలాయన సూత్రుడు. నందవరీకులు క్రీ.శ. 10వ శతాబ్దంలో కాశినుండి ఆంధ్ర దేశానికి వలస వచ్చిన శుద్ధవైదికబ్రాహ్మణులు. కడపజిల్లా రాజంపేట తాలూకా పొత్తిపినాడు మండలంలో చెన్నకేశవ స్వామి, కరుణాకటాక్షాలు పుష్కలంగా ఉన్న తాళ్లపాక గ్రామం వీరి స్వస్థలం. తాళ్లపాక గ్రామనామమే అన్నమయ్య వంశస్థులకు ఇంటిపేరు. వీరిలో నారాయణయ్య చాల ప్రసిద్ధుడు. నారాయణయ్య అన్నమయ్య తాత. చదువు అబ్బక, గురువులు పెట్టే హింసలు భరించలేక నారాయణయ్య చనిపోవాలని అనుకొన్నాడట. ఊరిలో గ్రామదేవత చింతలమ్మ గుడివద్ద విషసర్పం పుట్టలో చేయి పెట్టాడట. అప్పుడు అమ్మవారు ప్రత్యక్షమై అతని వంశంలో మూడవతరంలో హరి అంశతో ఒక బాలుడు జన్మిస్తాడని చెప్పిందట. ఈ నారాయాణయ్య కుమారుడే నారాయణ సూరి. నారాయణసూరి కుమారుడే అన్నమాచార్యులు.



అన్నమయ్య తండ్రి నారాయణసూరి గొప్ప కవి, పండితుడు, సకలవిద్యాధురంధరుడు. నారాయణసూరి ధర్మపత్ని లక్కమాంబ, మహాభక్తురాలు. భాగవతసేవా పరాయణులైన నారాయణసూరి, లక్కమాంబలు సంతానంకోసం ఏడుకొండలస్వామికి మొక్కుకున్నారు. ముడుపులు కట్టుకున్నారు. ఇద్దరూ తిరుమల చేరారు.

ఆ దంపతులు తిరుమలను దర్శించుకొని, ధ్వజస్తంభం ఎదురుగా సాష్టాంగపడ్డప్పుడు ఒక దివ్యమైనకాంతి లక్కమాంబ గర్భంలో ప్రవేశించిందట. వేంకటేశ్వరస్వామి తాను ధరించే **"బిరుదు గజ్జియల ముప్పిడి కతారాన్ని"** వారికందజేశాడట. అదే నందకఖడ్గం. లక్కమాంబ గర్భవతి



అయింది. వైశాఖమాసం విశాఖనక్షత్రంలో ఒక శుభలగ్నంలో మూడుగ్రహాలు ఉచ్ఛస్థితిలో ఉండగా నారాయణసూరి, లక్క మాంబలకు నందకాంశతో సర్వధారి సంవత్సరం వైశాఖశుద్ధ పూర్ణిమనాడు (మే 9, 1408). అన్నమయ్య జన్మించాడు. నారాయణసూరి ఆ శిశువునకు ఆగమోక్తంగా జాతకర్మ చేశాడు. 8వ యేట అన్నమయ్యకు ఆయన గురువు ఘనవిష్ణు దీక్షను ఇచ్చాడు. అప్పటినుండి అన్నమాచార్యనామం స్థిరపడింది. **"అన్నం బ్రహ్మేతి వ్యజానాత్"** అనే శ్రుతి ప్రకారం నారాయణ సూరి పరబ్రహ్మవాచకంగా తన పుత్రునకు అన్నమయ్య అని నామకరణం చేశాడు. అన్నమయ్యకు అన్నమయ్యంగారు, అన్న మాచార్యులు, అన్నయగురు, అన్నయార్య, కోనేటి అన్నమయ్యం గారు అనేవి నామాంతరాలు

### అన్నమయ్య బాల్యం

అన్నమయ్య బోసి నవ్వులు వెంకటప్పకు చేసే జోతలు అందరినీ అలరించేవి. వేంకటపతిమీద జోలపాడనిదే నిద్ర పోయేవాడు కాదు. నారాయణసూరి కావ్యప్రవచనాలకు తానూ ఊ కొట్టేవాడు. ఇలా అన్నమయ్యకు శిశుప్రాయం నుండి వేంకటపతి మీదే ధ్యానమూ ధ్యాసానూ.

అన్నమయ్యకు అయిదు సంవత్సరాలు నిండాయి. నారాయణసూరి ఉపనయనం చేయించాడు. అన్నమయ్య ఏక సంతాగ్రాహి. అతడి తెలివి చూసి గురువులు ఆశ్చర్యపోయే వాళ్ళు. ఆడిన మాటల్లా అమృతకావ్యమై. పాడినదల్లా పరమ గానమై అలరారేలా. చిన్ననాటనే వేంకటపతి మీద వింత వింతలుగా సంకీర్తనలు ఆలపించేవాడు. అన్నమయ్య చెన్న కేశవుడిని **"బుజ్జి కేశవా"** అని పిలిచేవాడు. ఆ బుజ్జిబాలుని ముద్దుమాటలకు మురిసి చెన్నకేశవుడు ముసిముసినవ్వులు చిందించేవాడట.

అన్నమయ్య ఎప్పుడూ ఆటల్లో పాటల్లో మునిగి తేలే వాడు. అన్నమయ్య మాటన్నా పాటన్నా ఆ ఊరు సంబరిపడి పోయేది. అన్నమయ్య బాల్యంలో తల్లిదండ్రులు, వదిన చెప్పిన పనులు అన్నీ చేసేవాడు. కానీ ఎప్పుడూ దండెం భుజాన తగి లించుకొని పాటలు పాడతూ కాలం గడుపుతాడని అన్న మయ్యపై ఇంట్లోవాళ్ల అక్కసు. గాలిపాటలు కట్టిపెట్టి అడవికెళ్ళి పశువులకింత గడ్డి నారాయణసూరి కూడా కొడుకును కసురు కున్నాడు.

అన్నమయ్య కొడవలి భుజాన తగిలించుకొని అడవికి బయలుదేరాడు. అడవికి వెళ్ళడం అలవాటు లేక ఒక చెట్టు కింద చతికిలబడ్డాడు. తంబురచేతిలోనే ఉంది. తీగలు సవ రించిపాడబోయాడు. పక్కనే ఉన్నకొడవలిని చూడగానే వచ్చిన పని గుర్తుకు వచ్చింది. అక్కడే ఉన్న కొడవలితో పచ్చికను కోస్తున్నాడు. మనసంతా శ్రీహరి మీదనే ఉండడంతో చిటికిన వేలు తెగి, రక్తం బొటబొటా కారింది. వేదన కలిగింది. దానితో పాటే విరక్తి, భక్తి కూడా పుట్టుకొచ్చాయి.

### తిరుమల పయనం



అటుగా వస్తున్న తిరుమల వెళ్ళే యాత్రికుల గుంపులో తానూ కలిసిపోయాడు అన్నమయ్య. యాత్రికులతో కలిసి తిరుపతి చేరుకొని, తిరుపతి పొలిమేరలో ఉన్న గ్రామశక్తి తాళ్లపాక గంగమ్మను సేవించాడు.

అనంతరం అన్నమయ్య మార్గమధ్యంలోని అళిపురి సింగరి, తలయేరుగుండు, పెద్దయెక్కుడు, కపురంపు కాలువ లనూ సందర్శించాడు. తిరుమల కొండను చెప్పులతో ఎక్కుతూ అలసి ఒక వెదురుపొదలో నిద్రపోయాడు.



అప్పుడు ఆయనకు కలలో అలివేలుమంగమ్మ దర్శన మిచ్చింది. పరమాన్నాన్ని ప్రసాదించింది. పాదరక్షలు లేకుండా కొండనెక్కమని బోధించింది. అప్పుడు అన్నమయ్య అలమేలు మంగను కీర్తిస్తూ శ్రీవేంకటేశ్వర శతకము రచించాడు. తిరుమల చేరుకొన్న అన్నమయ్య స్వామిపుష్కరిణిలో స్నానంచేసి, ఆది వరాహస్వామిని దర్శించుకొన్నాడు.

కోవెలపెద్ద గోపురంలోనికి ప్రవేశించి **"నీడ తిరుగని చింతచెట్టు"**కు ప్రదక్షిణ నమస్కారాలు చేసి, గరుడస్తంభానికి మ్రొక్కాడు. భాష్యకారులైన రామానుజాచార్యులను స్తుతించాడు. యోగనరసింహుణ్ణి దర్శించుకున్నాడు. జనార్దనుణ్ణి సేవించి, వంట ఇంటిలో వకుళాదేవికి నమస్కరించి, "యాగశాల"ను కీర్తించి, ఆనందనిలయం విమానానికి నమస్కరించాడు. కల్యాణ మంటపం, బంగారు గరుడశేషవాహనాలు, శ్రీభండారం,



హుండీలో తన పంచె కొంగున ముడివేసుకొన్న కాసును అర్పించాడు. బంగారువాకిలి చెంతకు చేరి, దివ్యపాదాలతో, కటి వరదహస్తాలతో సకలాభరణభూషితుడైన దివ్యమంగళశ్రీమూర్తిని దర్శించుకొన్నాడు. తీర్థప్రసాదాలను స్వీకరించి, శఠకోప ఆశీర్వ చనం పొంది, ఆ రాత్రి ఒక మండపంలో విశ్రమించాడు.

తరువాత అన్నమయ్య కొండపై కుమారధార, ఆకాశ గంగ, పాపవినాశంవంటి తీర్థాలను దర్శించాడు. అతడికి అతడి కీర్తనలవల్ల అపూర్వమైన ఆదరణ లభించడంతో కొండపైనే స్వామిని కీర్తిస్తూ ఉండిపోయాడు. ఘనవిష్ణువు అనే ముని అన్నమయ్యను చేరదీశాడు. శ్రీవైష్ణవ సంప్రదాయానుసారంగా పంచసంస్కారదీక్ష ఇచ్చాడు. గురువుల వద్ద వైష్ణవతత్త్వాలను తెలుసుకొంటూ, ఆళ్వారుల దివ్యప్రబంధాలను అధ్యయనం చేస్తూ, శ్రీవేంకటేశ్వరుని కీర్తిస్తూ తిరుమలలోనే అన్నమయ్య జీవితం గడపసాగాడు.

### వివాహం

అన్నమయ్య తిరుమలలో ఉన్నాడని తెలిసిన తల్లి దండ్రులు తిరుమలకు వెళ్ళి ఇంటికి తిరిగి రమ్మని బ్రతిమ లాడారు. నిరాకరించాడు అన్నమయ్య. గురువుగారి మాటపై తాళ్లపాకకు తిరిగి వచ్చాడు. కానీ నిరంతరం స్వామిని కీర్తిస్తూ ఉండేవాడు. తిమ్మక్క, అక్కమ్మలతో అన్నమయ్యకు వివాహం జరిపించారు తల్లిదండ్రులు. తరువాత తన ఇద్దరుభార్యలతో వచ్చి తిరుమలను సందర్శించిన అన్నమయ్య శ్రీవేంకటపతికి రోజుకొక సంకీర్తన వినిపించాలని సంకల్పించాడు. అప్పటి నుండి అన్నమయ్య పుంఖానుపుంఖాలుగా చెప్పిన సంకీర్తనలను శిష్యులు గానం చేస్తూ తాళపత్రాలపై రాసేవారు. తరువాత అన్నమయ్య తన భార్యలతో కలసి తీర్థయాత్రలు చేస్తూ తాను దర్శించిన క్షేత్రాలను ఆ క్షేత్రదేవతలను కీర్తిస్తూ సంకీర్తనలను వెలయించాడు. అహోబలమఠస్థాపనాచార్యుడైన ఆదివణ్ శఠ కోపయతులవద్ద అన్నమయ్య సకలవైష్ణవాగమాలను అధ్యయనం చేశాడు.

### రాజాశ్రయం

విజయగరరాజప్రతినిధి, దండనాథుడు **"మూరురా యర గండ"** సాళ్వనరసింగరాయలు అన్నమయ్యను ఆదరించాడు. తన ఆస్థానానికి ఆహ్వానించాడు. తరువాత కొంతకాలానికి ఆ రాజు అన్నమయ్యను తనపై కూడా ఒక్క సంకీర్తనను రాయమన్నాడట. దానికి అన్నమయ్య నిరాకరించడంతో రాజు

అన్నమయ్యను చెరసాలలో ఉంచాడట. చివరికి రాజాస్థానం తనకు తగదని అన్నమయ్య తిరుమల చేరి, తన శేషజీవితాన్ని స్వామి సన్నిధిలో సంకీర్తనా దీక్షలో గడిపాడు.



అతడిగురించి కథలు కథలుగా విన్న ప్రజలు అతడి సంకీర్తనలకు బ్రహ్మారథం పట్టారు. ఈ సమయంలోనే పురందర దాసు తిరుమలకు అన్నమయ్యను కలుసుకొని "మీ సంకీర్తనలు పరమమంత్రాలు. మీరు సాక్షాత్తు వేంకటపతి అవతారమే" అని ప్రశంసించాడట. 95 సంవత్సరాలు పరిపూర్ణజీవితం గడిపిన అన్నమయ్య దుందుభి నామసంవత్సరం ఫల్గుణ బహుళద్వాదశి నాడు పరమ పదించాడు.

నందకాంశ సంభూతుడైన అన్నమయ్య **"పదకవితా పితామహుడు", "సంకీర్తనాచార్యుడు", "పంచమాగమ సార్వ భౌముడు", "ద్రవిడాగమసార్వభౌముడు"** - అని ప్రసిద్ధి పొందాడు. అవసానకాలంలో తన కొడుకు పెదతిరుమలయ్యకు రోజుకు ఒక్క సంకీర్తనకు తక్కువ కాకుండా శ్రీనివాసునకు వినిపించే బాధ్యతను అప్పగించాడు.

## అన్నమయ్య కృతులు

అన్నమయ్య తెలుగులోనే కాదు సంస్కృతంలోనూ కొన్ని వందల కీర్తనలను రచించాడు. తమిళ, కన్నడ పదాలతో కూడిన అతని తెలుగు వ్యావహారిక భాష. మార్గ, దేశి సంగీత విధానాల మేళవింపు. అన్నమయ్య **"యోగ వైరాగ్య శృంగార సరణి"** మొత్తం 32,000 సంకీర్తనలు, సంకీర్తనాలక్షణమనే సంస్కృత గ్రంథం, మంజరీ ద్విపదలో **"శృంగారమంజరి"** అనే కావ్యం, మరో 12 శతకాలు రచించినట్లు తెలుస్తోంది. కానీ వీటిలో కొన్ని లభించడం లేదు.

అన్నమయ్య రచనలు "ఒక సారస్వత క్షీరసముద్రం. కావ్యముల ధర్మమైన భావార్ణవంలో, శైలిలో, భావవైవిధ్యంలో, రాశిలో అన్నమాచార్యుని రచనను మించినది ఆంధ్రవాఙ్మయంలో మరొక్కటి లేదు... నగుబాట్లైన ద్విపద, పద కవితలను ఉద్ధరించి ఉన్నత స్థానం కలిగించిన ప్రతిష్ఠ అన్నమాచార్యునిదే" అన్న రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి మాటలు అక్షరసత్యాలు.

**"అదివో అల్లదివో హరివాసము",**

**"అలర చంచలమైన ఆత్మలందుండ నీ యలవాటు చేసె నీ వుయ్యాల",**

**"క్షీరాబ్ధి కన్యకకు శ్రీ మహాలక్ష్మికిని నీరజాలయమునకు నీరాజనం"**

– వంటి ఎన్నో కీర్తనలు నేటికీ జనులనోళ్లలో నడయాడుతున్నాయి. అందుకే అన్నమయ్యను ఇలా కీర్తిస్తారు.

**హరి యవతార మీతడు అన్నమయ్య**
**అరయ మా గురుడీతడు అన్నమయ్య**

**వైకుంఠ నాథుని వద్ద వడి పడు చున్న వాడు**
**ఆకరమై తాళ్లపాక అన్నమయ్య**
**ఆకసపు విష్ణు పాదమందు నిత్యమై ఉన్న వాడు**
**ఆకడీకడ తాళ్లపాక అన్నమయ్య**

**ఈవల సంసార లీల ఇందిరేశుతో నున్న వాడు**
**ఆవటించి తాళ్ళపాక అన్నమయ్య**
**భావింప శ్రీ వేంకటేశు పదములందే యున్నవాడు**
**హావభావమై తాళ్లపాక అన్నమయ్య**

**క్షీరాబ్ధిశాయి బట్టి సేవింపుచు నున్నవాడు**
**ఆరితేరి తాళ్లపాక అన్నమయ్య**
**ధీరుడై సూర్యమణ్డల తేజము వద్ద నున్నవాడు**
**ఆరీతుల తాళ్లపాక అన్నమయ్య.**



# ఒంటిమిట్ట

# శ్రీ కోదండరామస్వామి ఆలయం

- విద్వాన్ కట్టానరసింహులు,
94413 37542




నిగనిగమెరయు కిరీటము
ధగధగమను పట్టు దట్టి తగినకటారున్
భుగభుగవాసన నీకే
తగుతగురా ఒంటిమిట్ట దశరథరామా!

ఈ పద్యం చదువుతూవుంటే ఒంటిమిట్టగుడిలో కొలువు దీరిన కోదండరాముడు మన ఎదుట సాక్షాత్కరించినట్లుంటాడు. ఇక ఆ ఒంటిమిట్టకే వెళ్లి ఆ గుడిలో స్వామి చెంత చేతులు జోడించి నిలుచుంటే ఆ అనుభూతి బ్రహ్మానందం సుమా!

చెన్నై- ముంబై రైలుమార్గంలో, తిరుపతి- కడప బస్సు మార్గంలో ఒంటిమిట్ట ఉంది. రైల్లో ప్రయాణిస్తున్నా బస్సు మార్గంలో వెళుతున్నా ఎత్తైన గాలిగోపురాలతో, కోటగోడలాంటి ప్రాకారంతో ఒంటిమిట్ట కోదండరామాలయం కనిపిస్తుంది.

విజయనగరసామ్రాజ్యంలో ఉదయగిరి ప్రాంత పాలకుడుగా ఉండిన కంపరాయలు ఈ ప్రాంతం పర్యటించారు. ఒంటడు, మిట్టడు అనే బోయనాయకులు రాజుకు స్వాగతం పలికారు. సీతారామలక్ష్మణులు కొంతకాలం అరణ్యవాసం చేసిన ప్రదేశం ఇది అని చెప్పారు. సీతమ్మవారి దప్పిక తీర్చటానికి రాముడు బాణంతో సృష్టించిన బుగ్గను చూపించారు. రావణుడు చెరబట్టిన సీతమ్మకోసం వెతుకుతూ జాంబవంతుడు నిద్రించిన గుట్ట చూపించారు. ఆ గుట్టమీద గుడి కట్టించమనికోరారు. కంపరాయలు బోయల కోరికను మన్నించారు. గుడి కోసం చెరువును నిర్మించడానికీ అధికారం జారీ చేశారు. చక్రవర్తి బుక్కరాయలు కాశి నుంచి రామేశ్వరం వస్తూ క్రీ.శ.1556లో ఒంటిమిట్టగుడిని ప్రారంభించారు. అందులో సీతాలక్ష్మణ సహిత శ్రీరామచంద్రుని ఏకశిలా విగ్రహాన్ని నిలిపారు. అప్పటికి ఆలయం ఇంత పెద్దదికాదు. గర్భాలయం, అంతరాళమంటపం, ముఖమంటపంమాత్రమే ఉండేవి. ఆలయ నిర్వహణకోసం చెరువు క్రింది పొలాలు పంచారు. ఆ తరువాత వచ్చిన విజయనగరరాజులు, ప్రధానంగా సిద్ధవటాన్ని పాలించిన మట్లిరాజులు ఆలయాన్ని ఇప్పుడున్న స్థితికి తెచ్చారు.

స్వామి దర్శనానికి తూర్పుద్వారం నుంచి ఆలయంలోకి వెళ్లాలి. అక్కడ నిలబడి గాలిగోపురం చూస్తే తలగుడ్డ నేలరాలుతుంది. గాలిగోపురం అంత ఎత్తుంది మరి! పీచు తీయని కొబ్బరికాయను గోపురం పైనుంచి ఆలయం లోపలికి విసిరే పందెం కాసేవారు. ఆరాధన భావంతో ఆలయం సోపానాల మీదుగా నడుస్తూ ఉంటే, 'అలవైకుంఠపురం'లోకి వెళుతున్నట్లుంటుంది. మూడుపదులకు పైనున్న, విశాలమైన సోపానాల మీదుగా తూర్పు ద్వారంలో ప్రవేశిస్తూనే అక్కడ ఎడమచేతివైపున ఎద్దు ఏనుగుతో పోరాడుతున్న శిల్పం కనిపిస్తుంది. ఏనుగు అష్టమదాలకు గుర్తు. ఎద్దు అర్థాన్ని, కామాన్ని, ధర్మమార్గంలో నడుపుకొంటూ మోక్షం కోసం ప్రయత్నించే మనిషికి గుర్తు. ఈ మనిషి మోక్షం పొందాలంటే తనలోని అష్టమదాల(ఏనుగు)ను కూడా అణచుకోవాలి. అప్పుడే ఎదురుగా గర్భాలయంలో మోక్షాన్ని ప్రసాదించే శ్రీరామచంద్రమూర్తి దర్శనమిస్తారు. ద్వారం దాటుతూనే ధ్వజస్తంభం. ఆ స్తంభానికి దండంపెట్టుకొని ఆలయానికి ప్రదక్షిణం చేయాలి. కుడివైపు ఆలయం, ఎడమవైపు మహాప్రాకారం మహాప్రాకారంలో దక్షిణ ఉత్తరదిశల్లో గోపురాలు, ద్వారాలు

**ఆంధ్రప్రదేశ్ నుండి తెలంగాణా విడిపోయాక రాష్ట్ర ప్రభుత్వలాంఛనాలు ఒంటిమిట్టకు అందుతున్నాయి. ఒంటిమిట్ట ఆలయాన్ని అభివృద్ధిపథంలో నడిపే బాధ్యత తిరుమల తిరుపతి దేవస్థానములు స్వీకరించింది.**






కనిపిస్తాయి. ఆలయం నైరుతిదిశలో స్వామి కల్యాణ మంటపం, ఉత్తరంవైపు తూర్పుపడమరల్లో ఎదుర్కోలు మంటపాలు కనిపిస్తాయి.

రంగమంటపానికి ఉత్తరదక్షిణాల్లో మెట్లదారు లున్నాయి. దక్షిణంవైపు మెట్లదారి నుంచి రంగ మంటపంలోకి ప్రవేశించి రంగమంటపాన్ని పరిశీ లించి చూడండి. వరుసలు తీర్చిన బలిష్ఠమైన 32 రాతిస్తంభాలమీద మంటపం నిర్మించారు. స్తంభాల మీద ప్రతి అంగుళమూ శిల్పవిన్యాస శోభితం. విజయ నగర శిల్పకళమనల్ని ఉల్లాస పరుస్తుంది. ఇందులో రెండు స్తంభాలుమాత్రం చోళశిల్పకళను గుర్తుకు తెస్తాయి. వేసవికాలంలో ఎంతసేపయినా ఇక్కడ హాయిగా గడపవచ్చు.

రంగమంటపం నుంచి ముఖమండపం మీదుగా అంతరాళమంటపం, గర్భాలయం చేరుకుంటాం. ముఖమంటపంద్వారంలో ద్వారపాలకులు జయ విజయులు దర్శనమిస్తారు. ముఖమంటపం లోపల ఆళ్వారులసన్నిధి లభిస్తుంది.

రామస్వామి సన్నిధిలో ఆయన భక్తుడు ఆంజనేయ స్వామి లేడు. స్వామి ఉన్నచోటు వైకుంఠం కదా! ఆయనకు వైకుంఠం అక్కర్లేదట. బయటే ఉండి ఆత్మారాముడైన రామ దర్శనం చేసుకొంటూ ఉంటాడట. ఒంటిమిట్టలో తూర్పు గాలి గోపురానికి ఎదురుగా సంజీవరాయస్వామి దేవాలయం ఉంది. ఆంజనేయస్వామిని అక్కడకు వెళ్లి దర్శించుకోవాలి. ఆ ప్రక్కగా ఎత్తైన రథశాల, అందులో బ్రహ్మోత్సవాలలో సాగే రథం కని పిస్తుంది.

**ఈ ఆలయంలో చైత్రమాసంలో శ్రీరామనవమి నుంచి పదిరోజులు బ్రహ్మోత్సవాలు వైభవోపేతంగా నడుస్తాయి.**

**ఈ బ్రహ్మోత్సవాలలో నిర్వహించే వాహనసేవల వివరాలను 27వ పుటలో ఇవ్వడం జరిగింది. పాఠకులు గమనించగలరు.**

రాముడు సీతమ్మకోసం బాణంతో సృష్టించిన బుగ్గ – ఇప్పుడు రామ తీర్థం అయింది. బ్రహ్మోత్సవాల చివర చక్రస్నానం ఇక్కడ జరుగుతుంది. తిరుపతికి వెళ్లే బస్సు మార్గంలో చెరువుకట్ట కిందుగా గుడికి సమీపంలో ఆ రామతీర్థం ఉంది. రామతీర్థానికి గుడికి మధ్యనుండే తిప్పను శృంగిశైలం అంటారు.

ఇక్కడ వాసుదాసు (వావిలికొలను సుబ్బారావు)మందిరం ఉంది. ఆలయానికి పశ్చిమంగా బస్టాండు సమీపంలో రామగరి అనే మరో తిప్ప ఉంది.  సంక్రాంతి చివర కనుమనాడు పారువేట ఉత్సవంకోసం స్వామి ఇక్కడికి  వస్తారు.

సంవత్సరం పొడవునా ఆలయంలో ఉత్సవాలు జరుగుతుంటాయి. రథసప్తమి, వైకుంఠ ఏకాదశి ఘనంగా నిర్వహిస్తారు. చైత్రమాసంలో శ్రీరామ నవమి నుంచి పదిరోజులు బ్రహ్మోత్సవాలు వైభవోపేతంగా నడుస్తాయి. పోతనజయంతి, గరుడసేవ, హనుమద్వాహనం చతుర్దశినాటిరాత్రి సీతారామ కల్యాణం, మరునాడు రథోత్సవం ఆ తర్వాత ఏకాంతసేవ ప్రసిద్ధ ఉత్సవాలు.

ఒంటిమిట్ట గుడిని చూడాలని వచ్చిన యాత్రికులు తూర్పు ద్వారం సోపానాల సమీపంలో ఉన్న మాల ఓబన్న మంటపం, సోపానాలకు కుడి వైపున ఇమాంబేగ్ బావి తప్పకుండా చూస్తారు. ఆ విశేషాలు తెలుసు కొంటారు.

ఆంధ్రప్రదేశ్‌నుండి తెలంగాణా విడిపోయాక రాష్ట్రప్రభుత్వలాంఛ నాలు ఒంటి మిట్టకు అందుతున్నాయి. ఒంటిమిట్ట ఆలయాన్ని, అభివృద్ధి పథంలో నడిపే బాధ్యత తిరుమల తిరుపతి దేవస్థానములు స్వీకరించింది. నవ్యాంధ్రప్రదేశ్‌లో దశ తిరిగిన ఆలయాల్లో ఒంటిమిట్ట మొదటిది.





ఈ ఆలయంలో సీతాలక్ష్మణ సహిత శ్రీరామచంద్రుని ఏకశిలా విగ్రహాన్ని నిలిపారు.





# చంద్రగిరి శ్రీ కోదండరామస్వామి ఆలయం

– శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం

శ్రీ వేంకటాచలక్షేత్ర పరిసరసానువుల్లో ఎన్నెన్నో క్షేత్రాలు, మరెన్నెన్నో దేవాలయాలు నెలకొనివున్నాయి.

అలాంటివాటిల్లో, తిరుమలక్షేత్రంతో ఆధ్యాత్మికంగా, చారిత్రికంగా విడదీయలేని ఒక అనుబంధాన్ని పెనవేసుకున్న దేవాలయం చంద్రగిరిలోని శ్రీ కోదండరామస్వామి ఆలయం.

తిరుమలకొండలకు దక్షిణంగా కూతవేటు దూరంలో సహజసిద్ధంగా ఏర్పడిన చిన్నరాతికొండే **'చంద్రగిరి'.** ఆ కొండకు దిగువన ఆనుకొని ఉన్న గ్రామంపేరుకూడా **'చంద్రగిరి'.** ఆ గ్రామంవల్ల ఆ కొండకు పేరు కల్గిందా, లేక ఆ కొండవల్లే ఆ ఊరికి ఆ పేరు ఏర్పడిందా అన్నది చెప్పడం చాల కష్టం. అంతకుపూర్వం వీటికి ఏ పేర్లు ఉండినాయో చెప్పడం కూడా కష్టమే! మరి!

ఆ ఊరికి చుట్టూ అర్ధచంద్రాకారంలో ఆ కొండ ఉండడం వల్లా, ఆ కొండమీద చంద్రుడు తపస్సు చేసి నందువల్లా దానికి **'చంద్రగిరి'** అనే పేరు ఏర్పడిందని అదే పేరు ఆ ఊరికి కల్గిందని కొందరు చెప్తున్న మాట!

కాని, ఆ ఊరికి, ఆ కొండకు ఆ పేరు కల్గడానికి ప్రధానమైన ఆధారంగా వెలసిన ఆలయం **'చంద్రగిరి'**లోని అత్యంత ప్రాచీనమైన **'శ్రీ కోదండరామస్వామి ఆలయం'.**

శ్రీరామచంద్రస్వామి ఆలయానికి ఆనుకొని ఉన్న కొండ కనుక **'రామచంద్రునిగిరి'** అని ఆ కొండా, ఆ ఊరూ రెండు ఒకే పేరుతో పిలువబడినాయి. ఆ 'రామచంద్రుని గిరి' రానురాను కాలాంతరంలో 'రామచంద్రగిరి' అని పిలువబడుతూ జనుల వ్యవహారంలో 'చంద్రగిరి' అని సంక్షిప్తంగా అయ్యిందన్నది మరో కథనం!

**తిరుమల కొండలకు దక్షిణంగా కూతవేటు దూరంలో చంద్రగిరిలో ఈ ఆలయం ఉంది.**

విజయనగరరాజులు తమ పరిపాలనా సౌలభ్యం కోసం చుట్టూ కీకారణ్యం మధ్యలో ఉన్న ఎత్తైన 'చంద్రగిరి'ని రెండోరాజధానిగా

చేసుకొని కొండపై శత్రునిర్భేద్యమైన కోటగోడను, బురుజులను నిర్మించి, దానికి ఆనుకొని నీళ్ళతో నిండిన లోతైన అగడ్తలను నిర్మించుకొన్నారు.

విజయనగరరాజులు తిరుమలేశుని అచంచల భక్తులు. ఎన్నో మడులను, మాన్యాలను, నగానట్రా, నివేదనలను స్వామివారికి సమర్పించుకున్న వితరణ శీలులైన విజయనగరపాలకులు, చంద్రగిరిలో విడిది చేసినప్పుడు **"తిరుమల శ్రీవారి నైవేద్య ఘంటానాదం"** వినపడేట్లుగా, తిరుమల నుండి చంద్రగిరి వరకు, అంచెలంచెలుగా ఘంటామండపాల్ని నిర్మింపజేసి, ఆ ఘంటానాదాన్ని విన్న తర్వాతనే తాము భోజనం చేసేవారట! అంతేగాక చంద్రగిరి నుండి తిరుమలకు నడిచివెళ్లే **'శ్రీవారిమెట్టు'** మార్గంలో రామానుజకూటాలనే అన్నసత్రాలను, దేశాంతరమఠాలను స్థాపించి ఈ రాజులు యాత్రికుల సేవలో తరించారు.




ఇలా విజయనగరరాజుల పర్యవేక్షణలో మూడుపువ్వులూ, ఆరుకాయలుగా ఉత్సవాలతో వైభవంగా వెలిగిన ఆలయం 'చంద్రగిరి'లోని శ్రీకోదండరామస్వామి ఆలయం. ఈ ఆలయం ఎప్పుడు ప్రతిష్ఠింపబడిందో స్పష్టంగా తెలియక పోయినా, క్రీ.శ.1535 నుంచి విజయనగరపాలకులచేత పునర్నిర్మింపబడుతూ అభివృద్ధి చెందిన ఆలయంగా తెలుస్తున్నది.

తూర్పుముఖంగా నిర్మింపబడిన ఈ ఆలయంలో ముఖ్యంగా గర్భాలయం, పైన ఏకకలశగోపురం, దాని చుట్టూవున్న విమాన ప్రదక్షిణమార్గం తిరుమలేశుని ఆనందనిలయ విమానం, ముక్కోటి ప్రదక్షిణాన్ని పోలి వుండడం చాల విశేషం. ఆనందనిలయం త్రితల గోపురం, కాగా చంద్రగిరిలోనిది ద్వితల గోపురం. తిరుమలలోమాదిరే ఈ గోపురానికి నాలుగు మూలల్లో సింహాల శిల్పాలు ఉండడం గమనించవచ్చు.

చంద్రగిరి శ్రీకోదండరామస్వామి ఆలయం తూర్పుముఖంగా గర్భాలయం, శయనమండపం, అంతరాళం, ముఖమండపం, మహాముఖమండపం, అని నాలుగు భాగాలుగా నిర్మాణమైంది.

గర్భాలయం మధ్యలో ఏకశిలాపీఠంపైన శ్రీరాముని ఎడమ తొడపై సీతాదేవి ఆసీనురాలై ఉండగా, రాముడు అభయముద్రతో ఎలాంటి ఆయుధాలు లేకుండా ఆసీన భంగిమలో శిలామూర్తిగా దర్శనమిస్తున్నాడు. రామునికి కుడి పక్కన లక్ష్మణభరతులు, ఎడమ పక్కన శత్రుఘ్నులు నిలిచివున్నారు.

**ప్రాచీనకాలం నుండీ విజయనగరరాజులకాలంలో ఎన్నో ఉత్సవాలతో ఊరేగింపులతో ఘనంగా వైభవంగా వెలిగిన ఈ చంద్రగిరి శ్రీకోదండరామస్వామి ఆలయాన్ని ఇటీవలే తిరుమల తిరుపతి దేవస్థానంవారు స్వీకరించారు.**

**ఇక్కడ ఆలయంలోని మూలమూర్తులు**



**ఇక్కడ ఆలయంలోని ఉత్సవమూర్తులు**



ఇది శ్రీరామపట్టాభిషేకం శిల్పం అన్నమాట. వారికి ముందు అదే పీఠం క్రింది భాగంలో గరుత్మంతుడి, రామాయణం పఠిస్తున్న ఆంజనేయుడి శిల్పాలు వున్నాయి.

ఈ ఆలయంలోని రాముడు **"పట్టాభిరాముడు"** అయినా ఈయన **"శ్రీకోదండరామస్వామి"**గా పిలువబడుతుండడం గమనించవలసిన అంశం. వీటితోపాటు శయన మండపంలో శ్రీసీతారామలక్ష్మణహనుమంతులు, సుదర్శనుడు మున్నగు పంచలోహ ఉత్సవమూర్తులు ఉన్నాయి. ఉత్సవమూర్తులు మాత్రం కోదండధారులుగా ఉన్నారు. అయితే సీతమ్మమాత్రం శ్రీరాముడికి కుడివైపున వుండడం కనపడుతుంది.

ఈ ఆలయంలోని ముఖమండపంలో అంతరాళం ప్రవేశద్వారానికి ఇరువైపులా జయవిజయుల నిలువెత్తు శిలా మూర్తులతోపాటు ఈ మండపంలోనే శ్రీలక్ష్మీనరసింహ స్వామి, పన్నెండుమంది ఆళ్వారులు, విష్వక్సేనుడు, శ్రీవేణు గోపాలస్వామి మున్నగు శిలామూర్తులు చోటు చేసుకున్నాయి. ఈ ముఖమండపం గర్భాలయానికి ప్రదక్షిణ పథంగా కూడ నిర్మింపబడింది. ఈ ప్రదక్షిణపథం తిరుమల శ్రీవారి ముక్కోటి ప్రదక్షిణను పోలివుండడం విశేషం!

మహాముఖమండపంలో శ్రీస్వామికి ఎదురుగా భక్తాంజనేయస్వామి మండపం, ఇదే ముఖమంపంలో దక్షిణాభిముఖంగా మరో వీరాంజనేయస్వామివారి మూర్తి ప్రతిష్ఠింపబడినాయి.

అత్యంత ప్రాచీనకాలంనుంచీ పాంచరాత్రాగమ వడగల్ సంప్రదాయ బద్ధంగా అర్చనలు జరుగుతున్న ఈ ఆలయంలో ప్రతిరోజు శ్రీకోదండరామస్వామివారికి సుప్రభాతం, తోమాలసేవ అర్చన, మూడుపూటలా నివేదనలు, ప్రతి శనివారం అభిషేకం, జరుగుతాయి. ప్రతిఏటా శ్రీరామ నవమినుంచి పదిరోజులపాటు బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. వీటినే **'శ్రీరామజననోత్సవాలు'** అని ఇక్కడ అంటారు. ఈ ఉత్సవాల్లోనే చైత్రపున్నమినాడు **'శ్రీసీతారాములకల్యాణం'** జరిగిన తర్వాత గ్రామోత్సవం చేస్తారు. 'రథసప్తమి' వైకుంఠ ఏకాదశి పర్వదినాల్లో గ్రామోత్సవాలు జరుగుతాయి. మిగతారోజుల్లో ఆలయప్రాకారంలోనే ఊరేగింపులు జరుపబడుతవి.

ప్రాచీనకాలంనుండీ విజయనగరరాజులకాలంలో ఎన్నో ఉత్సవాలతో ఊరేగింపులతో ఘనంగా వైభవంగా వెలిగిన ఈ 'చంద్రగిరి' శ్రీకోదండరామస్వామి ఆలయాన్ని ఇటీవలే తి.తి.దేవస్థానం వారు స్వీకరించారు.

ఏడుకొండల వాని అండన చేరిన 'చంద్రగిరి' శ్రీకోదండరాముని ఆలయం దినదినాభివృద్ధి చెందుతూ మళ్లీ పూర్వవైభవాన్ని సంతరించుకోగలదని ఆకాంక్షిద్దాం.



**తాళ్లపాకకవులలో ఆద్యుడు అన్నమాచార్యులు. వీరి రచనలుగ మనము దక్కించుకొన్నవి శృంగార, అధ్యాత్మ సంకీర్తనలు, శృంగారమంజరి, వేంకటేశ్వరశతకం. వీరి తర్వాత కుమారుడు పెదతిరుమలయ్య, మనుమలు చినతిరుమలయ్య, చినతిరువెంగళనాథుడు (చిన్నన్న)ల రచనలు కొన్ని ప్రచురణ కెక్కినవి. సమకాలీనపండితుల ఈసడింపులకు లోనైన పదకవితలను, ద్విపదరచనలను సముద్ధరించి తెలుగు సాహితీవైభవాన్ని వర్చస్వంతంగ నిలిపిన ఘనత తాళ్లపాక కవిపుంగవులదే.**

# నీ నామమె మాకు నిధియు నిధానము!

– శ్రీ కామిశెట్టి శ్రీనివాసులు

తాళ్లపాకవారి రచనలన్నీ రాగిరేకుల మీద వ్రాసిపెట్టారో లేదో కాని, మనకు లభించిన రెండువేలకు పైబడ్డ రేకులు, తిరుమల తిరుపతిదేవస్థానాల మ్యూజియంలో ప్రస్తుతం పదిల పరచారు. ఆ రేకులమీద వ్రాయబడిన తాళ్లపాక వారి రచనలు ముద్రణ భాగ్యం పొందినవి. అందులో అన్నమయ్య, పెద తిరుమలయ్య, చినతిరుమలయ్య రచనలే కొంతవరకు లభ్య మయినవి. రాగిరేకుల మీద అంకెలు బేరీజు వేసినప్పుడు చాల వరకు రేకులు లుప్తమైనవనడం స్పష్టమే. అవి యెక్కడైనా, యెప్పుడైనా లభిస్తాయని ఆశ లేకపోలేదు. రాగం విలువ తెలి యని జాతి రాగికోసం వానిని కరిగించుకొన్నది. లేనివానిని గురించి ఆలోచించడం మాని, ఉన్న వానిని తృప్తితో అధ్య యనం చేయడమే మన కర్తవ్యం. ప్రపంచవాఙ్మయంలో యెక్కడ ఇన్నివేల రాగిరేకుల మీద సారస్వత రచనలు వ్రాసిన దాఖలా కనిపించదు.

తాళ్లపాకవారి సారస్వతం రాశిలో, వాసిలో గొప్పది. వీరి రచనల్లో సంకీర్తనలే ఎక్కువ. ప్రధానంగా పద కవితా పితామహుడు, సంకీర్తనాచార్యుడు, పంచమాగమ సార్వభౌముడని విఖ్యాతిని పొందిన అన్నమాచార్యుల సంకీర్తనలే మనకు ఎక్కువగా లభించినవి. తాళ్లపాకకవులు, సంకీర్తన, పదం, కృతి, పాట అని సమానార్థకంగానే వ్యవహరించారు. సంకీర్తన అంటే పల్లవి, చరణాలతోకూడిన రచన. ప్రతి పాటకు పల్లవి రెండు పాదాలు, చరణాలు మూడు ప్రాయికంగా ఉంటాయి. కొన్నిట రెండు లేక మూడుచరణాలకు మించి కనిపిస్తాయి. పాటలకు పల్లవి, చరణాల వింగడింపుతో పాటు రాగం పేరు కూడ పేర్కొన బడింది. అన్నమయ్య సంకీర్తనల్లో భిన్నరాగాలతో, భిన్నతాళా లతో కూర్చబడిన 'దేశిసూళాది' రాగతాళమాలిక కనిపిస్తుంది.

అన్నమయ్య సంకీర్తనలు రచించి లక్ష్యలక్షణసమన్వయ దృష్టితో సంకీర్తనాపరిశుద్ధికి 'సంకీర్తనలక్షణ' గ్రంథాన్ని కూడ రచించాడు. అన్నమయ్య సంస్కృతంలో రచించిన ఆ లక్షణ గ్రంథంకాని, దానికి వ్యాఖ్యానం చేసిన పెదతిరుమలయ్య గ్రంథంగాని మనకు లభించలేదు. చినతిరుమలయ్య పద్యగద్యా త్మకంగా అనువదించిన లక్షణగ్రంథమే మనకు మిగిలింది. తాళ్లపాకవారి సంకీర్తనలకు ఈ లక్షణగ్రంథంలో కొంత సమ న్వయం కనిపిస్తుంది.






చిత్రం: డా॥ చెలికాని మురళీకృష్ణారావు, బొబ్బిలి

అన్నమయ్య ప్రక్రియలో, భాషలో, భావంలో వినూత్న త్వాన్ని ప్రవేశపెట్టాడు. పల్లవి, చరణాలతో కూడిన సంకీర్తనకు వీరే మార్గదర్శకులు. అన్నమయ్యకు పూర్వం పాటలున్నట్లు ఆధారాలున్నా వాని స్వరూపస్వభావాలు తెలుసుకోవడానికి అవ కాశం లేకపోయింది. అవి కాలగర్భంలో కలిసిపోయినవి. కాబట్టి మనకు తెలిసినంతవరకు అన్నమయ్యవే తొలి తెలుగుకీర్తనలు. అన్నమయ్యకు పూర్వమున్న కృష్ణమాచార్యులు 'సింహగిరినరహరి వచనములు 'తాళబంధ ఛందోవిరహితములు', అవి ఒట్టి గేయ గంధులే.

అన్నమయ్య 'వచోనూత్నక్రియలు' ముక్తకాలైనా కావ్యరస శోభితాలు. ఉదాహరణకు,

**బ్రహ్మ గడిగిన పాదము**
**బ్రహ్మము దానె నీపాదము** - ఇది పల్లవి - తాను చెప్పదలచిన భావానికి పల్లవి తల కట్టు వంటిది. పల్లవిలో పొటమరించిన భావాన్నే చరణాలలో విస్తరింపచేస్తాడు.

**చెలఁగి వసుధగొలిచిన నీ పాదము**
**బలితలమోపినపాదము**
**తలఁకక గగనము దన్నినపాదము**
**బలరిపుఁ గాచినపాదము**

**కామినిపాపము గడిగినపాదము**
**పాముతలనిడిన పాదము,**
**ప్రేమపు శ్రీసతి పిసికెడి పాదము**
**పామిడి తురగపుఁ బాదము**

**పరమయోగులకుఁ బరిపరివిధముల**
**పరమొసఁగెడి నీపాదము**
**తిరువేంకటగిరి తిరమని చూపిన**
**పరమపదము నీపాదము. (సంపు.1 - సంకీ.191)**

సంకీర్తనాచార్యుడు ఆ బ్రహ్మ కడిగిన పాదాన్ని ఉల్లే ఖిస్తూ వామన త్రివిక్రమరూపాలను, రామకృష్ణాది అవతారా లను, పరమాత్మ తత్త్వాన్ని జ్ఞాపకం చేస్తున్నాడు. శరణాగతి ధర్మసూక్ష్మాన్ని ఉపదేశిస్తున్నాడు. ఈ 'కీర్తన' అనే ప్రక్రియద్వారా రాగతాళభావ సౌహార్ద్రా లతో శ్రోతలహృదయాలలో ఆధ్యాత్మిక హర్మ్యాన్ని నిర్మించాడు.

అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తనల్లో కనిపించేది లోకనీతి. ధర్మం, న్యాయం, మానసబోధ. దేహ - ఆత్మ - ఈశ - వీటి

వివేకాన్ని, జ్ఞానాన్ని భక్తిమార్గంతో ప్రబోధిస్తాడు. శ్రీవారి పూజలు, ఉత్సవాలు, ఊరేగింపులు, సేవలు, తీర్థాలు, యాత్రా విశేషాలు, కళ్లకు కట్టినట్లు వర్ణిస్తాడు. వారి శృంగారసంకీర్తనలు మధురభక్తి మార్గాన్ని బోధిస్తాయి. భగవంతుడొక్కడే పురుషోత్త ముడు, ఇతర జగత్తంతా స్త్రీ ప్రాయం. అలమేలుమంగా శ్రీని వాసుల అమలినశృంగారం, నాయికానాయకభావం, భగవద్వి రహం, జీవాత్మ పరమాత్మల సంశ్లేషం–అంతా ఆధ్యాత్మిక శిఖరా లను స్పృశించేవే. సంకీర్తనలక్షణం అన్నమయ్య కృతులను "వేంకటశైలవల్లభ రతిక్రీడారహస్యంబుల్" అని పేర్కొంటుంది. మచ్చుకొకటి –

పలుకు తేనెలతల్లి పవళించెను
కలికితనముల విభునిc గలసినది గాన

పల్లవిలోని భావాన్ని సంస్కారనిష్ఠంగ అర్థం చేసుకొంటే తర్వాతి చరణాలు బోధపడతాయి. నాయిక పలికింది, కలసింది నాయకుని తోడనే.

పతితో కలసి అలసిన ముద్దరాలు చెదరిన సొగసులు పతికి మనసా వచసా కర్మణా అర్పించుకొన్నదట. అది పరిణతిని పొందిన సంయోగదశ. ఇది జీవాత్మపరమాత్మల మధ్య పెనవేసుకొన్న బంధం. దివ్యదాంపత్యసుందరం.

నిగనిగని మోముపై నెఱులు గెలకులcజెదర
పగలైనదాకc జెలి పవళించెను
తెగని పరిణతులతోc దెల్లవారినదాcక
జగదేకపతి మనసు జట్టిగొనెc గాన

అందం, యౌవనం, ఆభిజాత్యం, ఔజ్జ్వల్యం కలబోసి నట్లున్న కులకాంత పరవశయై పరమాత్మ వశమైనది. ధర్మపత్ని తన ధర్మాన్ని నిర్వర్తించింది. పరమైకాంతికమైన సాన్నిధ్యం పరాకాష్ఠను పొందింది.

కొంగుజాతిన మెఱుcగు గుబ్బలొలయcగcదరుణి
బంగారుమేడపైcబవళించెను
చెంగలువ కనుcగొనల సింగారములు దొలcక
నంగజగురునితోడ నలసినది కాన.

'అంగజగురుడు' అనడం ఎంతో గౌరవాన్ని ఆపాదించింది. గృహమేధి కావడం సంతానం కోసమే. 'మన్మథుని కన్నతండ్రి' మరి చెప్పవలసినదేమున్నది.

మురిపెంపు నటనతో ముత్యాలమలcగుపై
పరవశంబునcదరుణి పవళించెను
తిరువేంకటాచలాధిపుని కౌcగిటcగలసి
యరవిరై నునుcజెమట నంటినది కాన

(సంపు.6 – సంకీ 74)

ముద్దరాలు అలసిసొలసి ముత్యాలమంచం మీద మువ్వంకమేనితో ఒరిగిపోయిందట. అలమేలుమంగ ముద్దు మురిపాలను తిలకించి పులకించిన కన్యాదాత తృప్తితో నిట్టూ ర్చాడు. అన్నమయ్య దుహిత అలమేలుమంగ, అల్లుడు శ్రీని వాసుడు, అన్నమయ్యది పితృస్థానం. శ్రీవారికల్యాణోత్సవం దేవాలయ ఆగమంలో ప్రవేశపెట్టిన ఘనత అన్నమయ్యదే. అలమేలుమంగను కన్నతల్లిగ భావిస్తాడు. కన్నబిడ్డగ లాలిస్తాడు.

జనవ్యవహారంలో ఉన్న భాషను, శపథం చేసి, 'జగతి కడ చెల్లుబళ్లైన' నగినా భాషించినట్టి నానుడిపలుకులతో, "తన



అన్నమయ్య సంకీర్తనల్ని విశ్లేషించడం కొంత ఓర్పుతో సాగించవలసినపని.
స్వతంత్రమైన వారి భావాలు, సూటిగ మనసును తాకే రసాత్మకమైన
వాక్యాలు, పదాలు, పదబంధాలు, నుడికారపుసొగసులు.
అన్నిటా మించి భావప్రకటనలో గల ఆర్జవత్వం మనల్ని పట్టినిలుపుతాయి.
అన్నమయ్య సంకీర్తనల్ని బుద్ధిలో రంగరించి హృదయంతో ఆలపించాడు.
అన్నమయ్య రసహృదయాన్ని అందుకోగలిగితే వేంకటపతి
సాక్షాత్కార వైభవాన్ని అనుభవించినవారమౌతాం.
భక్తి, సంగీత, సాహిత్యాల త్రివేణీసంగమం అన్నమయ్య సంకీర్తన రసస్పష్టి.

మంచి పుస్తకం...

# ఉపనిషద్దర్శనం

108 ఉపనిషత్తులు - సంస్కృత మూలం - తెలుగుభావం-
మూలానువాదం: పూర్వపండితులు

సరళీకరణ :
డా॥ జయంతిచక్రవర్తి

ప్రచురణ : నవరత్నబుక్‌హౌస్,
28-22-20, రెహమాన్‌వీధి,
అరండల్‌పేట, విజయవాడ-2,

ముద్రణ : 2016,

పుటలు : xxvi + 1297 +
రెండు అనుబంధాలతో -
9 పుటలు,
మొత్తం పుటలు - 1306.

వెల : రూ.1116/-

దూరవాణి : 0866-2432813
చరవాణి : 98480 82432

ఆధునికకాలంలో సంప్రదాయగ్రంథాలు సంపూర్ణస్వరూపంతో ముద్రణవ్యయాన్ని లెక్క పెట్టక, సర్వాంగసుందరంగా ఖరీదైన కాగితంపై పదికాలాలు నిలిచే పద్ధతిలో ముద్రితం కావడం ముదావహం!

ప్రస్తుత గ్రంథ రచయిత డా॥ జయంతి చక్రవర్తిగారు ఒక గొప్పప్రణాళికతో ఈ బృహత్‌గ్రంథాన్ని నిర్మించారు. తెలుగులో పూర్వపండితులు చేసిన ఉపనిషత్తుల అనువాదాలు జటిలమైన గ్రాంథికభాషలో ఉంటే, వాటిని సరళీకరించి శిష్టవ్యావహారికభాషలో ఈనాటిపాఠకులకు అందుబాటులో తేవడంలో చక్రవర్తిగారు చాల శ్రమించారని వేరుగా చెప్ప నక్కరలేదు. 108 ఉపనిషత్తులను ఒక్కచోటికి తెచ్చి, ఏకైకగ్రంథంగా చేసి, అరుదైనకృషిచేసి ఇప్పటికీ, ఎప్పటికీ దాచుకొని జీవితాంతం చదువుకొనే పుస్తకాన్ని అందించిన డా॥ జయంతి చక్రవర్తి ఎంతైనా అభినందనీయులు. ధర కూడా ఈ కాలానికి సమంజసమైందే!

ఈ గ్రంథానికి రచయిత ఎనిమిదిపుటల పీఠిక వ్రాస్తూ ఉపనిషత్తులను చక్కగా పాఠకులకు పరిచయం చేశారు. ఈ పుస్తకంలో ఋగ్వేద ఉపనిషత్తులు - 10, శుక్లయజుర్వేద ఉపనిషత్తులు - 19, కృష్ణయజుర్వేద ఉపనిషత్తులు - 32, సామవేద ఉపనిషత్తులు - 16, అధర్వవేదఉపనిషత్తులు- 31 వెరసి 108 ఉపనిషత్తులకు సంస్కృతమూలాన్ని తప్పులేకుండా ముద్రించి, దాని తాత్పర్యాన్ని వివరిస్తూ శిష్ట వ్యావహారికభాషలో, తేటతెలుగులో, వ్రాశారు. ఇది ఈనాటి ఉపనిషత్ తత్త్వజిజ్ఞాసువులకు, విద్యార్థులకు, పరిశోధకులకు వేదాంతోపన్యాసాలను ఇచ్చే ప్రవాచకులకు ఒక గొప్ప ఆకర గ్రంథంగాను, అపూర్వనిధిగాను ప్రతి ఇంటిలో ఉండాల్సిన ఉత్తమగ్రంథం.

గొప్ప గొప్ప సంస్థలు చేయవలసిన పనిని ఏకదీక్షగా పూనుకొని ఒంటిచేతిమీదుగా తీసుకురావడం ఒక ఎత్తైతే, ఈ గ్రంథాన్ని పుటలసంఖ్యను పట్టించుకోక ముద్రించి వెలువరించిన నవరత్నబుక్‌హౌస్ ప్రచురణసంస్థ వారు కూడా సంప్రదాయసాహిత్యానికెంతో సేవచేస్తున్నందుకు అభినందించకతప్పదు. గ్రంథాంతంలో రచయిత చేర్చిన రెండు 'అనుబంధాలు' పాఠకులకు, యోగసాధకులకు సాంకేతిక విషయాలలో కలిగే సందేహాలను వివరిస్తూ, గ్రంథ ప్రామాణికతకు మరింతగా వన్నెతెస్తూ ఉంది. దీన్ని అందరూ కొని ఆదరించడం మంచిది.

*- డా॥ ముదివేడు ప్రభాకరరావు*

సంకీర్తనలను ఆవిష్కరించాడు. సంకీర్తన పాడాలన్నా, చదవాలన్నా ఆ వాక్యాలలో ఉన్న కాకువు, కారకం, నాటి వ్యావహారిక రూఢిని గమనించి అన్వయించుకోవలసి ఉంది. ఆ వ్యవహారంలో తమిళ, కన్నడ పదాలు కూడ చోటు చేసుకొన్నాయి. ఆలయసంప్రదాయంలో ఉన్న పదజాలంకూడా వీరి సంకీర్తనల్లో ప్రవేశించింది.

అలనాటి వ్యవహారంలో ఉన్న కొన్ని శబ్దాలు, పదాలు నేటి వ్యవహారంలో కనిపించవు. ఉన్నా, కొంత అర్థ విపరిణామాన్ని కూడ పొందాయి. పాట సౌకర్యం కోసం కొన్ని పదాలను స్వతంత్రంగా మలచుకొన్న సందర్భాలు కూడ కనిపి స్తాయి. జానపదసంగీతంతో బాటు, వారి మాటల్లో యాస కూడ చొప్పించాడు. ఒక్క పాట-

శిరుతనవ్వుల వాఁడు శిన్నెకా, వీఁడు
వెఱపెఱఁగడు సూడవే సిన్నెకా

చిరునవ్వులు చిందించేమూర్తి శ్రీనివాసుడు. సకల ప్రాణులకు అభయమిచ్చే దేవునికి భయమా! శిష్టులను రక్షించి దుష్టులను శిక్షించే పరమాత్ముడు! ధర్మసంస్థాపనార్థం మాటిమాటికి అవతరిస్తూనే ఉంటాడు. ఇది జనపదుల మనసులో పల్లవించిన భావం. శ్రీహరి దశావతారాలను చరణాలలో బిగించాడు.

పొలుసు మేనివాఁడు[1] బోరవీఁపువాఁడు[2]
సెలసు మోరవాఁడు[3] సిన్నెకా
గొలసుల వంకల కోరలతో బూమి
వెలసినాఁడు[4] సూడవే సిన్నెకా

మేఁటి కుఱుచవాడు[5], మెడమీఁది గొడ్డలి
సీటకాల వాఁడు[6] సిన్నెకా
ఆఁటదానిఁ బాసి అడవిలో రాకాశి
వేఁటలాడీ[7] జూడవే సిన్నెకా

బింకపు మోఁతల పిల్లఁగోవివాఁడు[8]
సింక సూపులవాఁడు[9] సిన్నెకా
కొంకక కలికియై[10] కొసరి కూడె నన్ను
వేంకటేశుఁడు సూడవే సిన్నెకా
(సంపు.5 - సంకీ.182)

1) మత్స్య, 2) కూర్మ, 3) వరాహ, 4) నరసింహ, 5) వామన, 6) పరశురామ, 7) దశరథరామ, 8) శ్రీకృష్ణ, 9) బుద్ధ (పురాణ), 10) కల్కి (భవిష్యదవతారం). తెలుగుపదాలతో అవతారాల కథలను సూచించడం అన్నమయ్య విలక్షణత్వం. అన్నమయ్య హృదయపుష్కరిణిలో ఎన్నో శతసహస్రపత్ర కమలాలు ఉదయించాయి. ఆ పద్మసుగంధాన్ని ఆస్వాదించడానికి శబ్దార్థపరిజ్ఞానంతో పాటు భక్తి జ్ఞాన వైరాగ్యాల అవగాహన కూడా అవసరం. అద్వైత, ద్వైత విశిష్టాద్వైత ధర్మాలు వారి కృతులలో తొంగిచూస్తాయి. అన్నమయ్యది "శ్రీ వేంకటేశాద్వైతం" సకలాన్ని సర్వేశ్వరుడైన వేంకటేశ్వరునిలోనే దర్శించాడు. వారి అంతరంగ బహిరంగాలలో ఆ తిరుమూర్తి తత్త్వమే అలము కొంది. అతడు ఆడినా, పాడినా, కలసినా, కలహించినా, పొగడినా, తెగడినా అంతటా అన్నిటా 'ఆతడే'. అంతా శ్రీనివాసమయం.

వేంకటేశ్వరుడు ఆదిమూలానికి సంకేతం. మనం చూసే మూర్తి మనమనుకొనే ఏ ఒక్క స్వరూపానికి పరిమితం కాదు. కేవలం ఒక విశ్వాసానికి నిదర్శనం కాదు. మన తృప్తికోసం మనమొక ఆరాధనక్రమాన్ని ఏర్పరచుకొని వ్యవహరిస్తున్నాం. అన్నమయ్య సమయము వచ్చినప్పుడంతా ఆ "పరతత్త్వాన్ని" విశద పరుస్తూనే ఉన్నాడు. "ఎంత మాత్రమున యెవ్వరు తలచిన అంత మాత్రమె నీవు". శివుడిగా, మాధవునిగా, భైరవునిగా, శక్తిగా పలువురికి పలువిధాలుగ గోచరిస్తావు" - అని భగవత్తత్త్వాన్ని సంకుచితంగా గాక విశాలదృక్పథంతో అనుభవించమంటున్నాడు. తాత్త్వికసుందరమైన పరమాత్ముని లీలావిభూతిని జ్ఞానంతో సాధించమంటున్నాడు. వేంకటేశ్వరుని మూర్తిలో దేవుడున్నాడు. ఆ మూర్తే దేవుడు కాదు. "తిరువేంకటేశునికి దివ్యవిగ్రహమేడ" అంటూ అన్నమయ్య గానం చేసిన కీర్తనలో "పరమాత్మ తత్త్వరహస్యం" ప్రపంచింపబడింది.

విశ్వప్రకాశునకు వెలియేడ లో నేడ
శాశ్వతున కూహింప జన్మమిఁక నేడ

సర్వపరిపూర్ణునకు సంచార మిఁక నేడ
నిర్వాణమూర్తికిని నిలయమిఁక నేడ
వుర్వీధరునకు కాలూన నొకచోటేడ
పార్వతీస్తుత్యునకు భావ మిక నేడ



చిత్రం: నీలి వేంకటరమణ

నానా ప్రభావునకు నడుమేడ మొదలేడ?
ఆననసహస్రునకు నవ్వులివ లేడ
మౌనిహృదయస్థునకు మాటేడ పలుకేడ
జ్ఞానస్వరూపునకుఁగాన విన నేడ

పరమయోగీంద్రునకు పరులేడ తానేడ
దురితదూరునకు సంస్తుతినింద లేడ
"తిరువేంకటేశునకు దివ్యవిగ్రహమేడ"
హరికి నారాయణున కవుఁగాము లేడ.
(సంపు.1 - సంకీ.355)

అన్నమయ్య జ్ఞాననేత్రాలు విచ్చుకొని శ్రీనివాసపరతత్త్వాన్ని దర్శించాయి. ఆ అనుభవాన్ని తన 'వచోనూత్నక్రియలలో' ఆవిష్కరించాడు. భావం-భాష-ప్రక్రియ కేవలం అవలంబాలే. "తెలిసితే తనలో దేవుడున్నాడు" ఇది అన్నమయ్య ఆత్మవిశ్వాసం. సాధనచతుష్టయంతో మర్మాలను ధర్మాలను అందుకొని మనకందించాడు. అన్నమయ్య ధన్యుడైనాడు. ఆ సంకీర్తనల ననుభవించి మనము ధన్యులమౌదాం.

శ్రీనివాసో రక్షతు





# జానకితో..... జనాంతికం

- శ్రీ దువ్వూరి వేంకటరమణ శాస్త్రి

తల్లిగా జానకీ! మనం మాట్లాడుకుని చాలా రోజులైం దమ్మా–అప్పుడప్పుడూ భద్రాచలం వస్తూనే ఉన్నాను. అయిదారు రోజులు ఆగుతూనే ఉన్నాను. అమ్మని పలకరించడానికి అవకాశమే కనబడదు. వచ్చే జనానికి అంతూపొంతూ లేదాయె! వచ్చినవాళ్లు తమకి కావల్సిందేదో ఆయనతో మాట్లాడుకుని వెళ్లారేమే అంటే ఆయన పిలిస్తే పలకడాయెను... పలుకే బంగారమట! అంత ఇదేమిటో? పలక్కపోతే మన అదృష్టం ఇంతే అనుకుని, పోనీ ఆ వచ్చిన వాళ్లు తిరిగిపోతారా.... ఊహూ. పక్కన నువ్వున్నావుగా జాలిపడే తల్లివి. 'సీతమ్మ తల్లీ! నీవైనా చెప్పవమ్మా' అని కొందరు, 'విభునికి మా మాట వినిపించవమ్మా' అని కొందరు కూనిరాగాలు తీస్తూ నీ చుట్టూ మూగుతారు. నీకీ సిఫారస్సులతోనే సరిపోతుంది. ఎప్పుడూ ఇదే మేళం. ఇంక నీ దగ్గర కూచునేదెప్పుడు?

వాళ్లందర్నీ తప్పించుకుని ఎదరికి వద్దామా అను కుంటూ ఉంటాను. రావచ్చుగానీ, పాపం! వాళ్లంతా ఎక్కడెక్కడి నించో ఎన్నెన్నో కోరికలతో వస్తారనీ, వాళ్లకి అడ్డొస్తే బాధపడతా రనీ ఎప్పటికప్పుడే వెనక్కి తగ్గుతుంటాను. మొన్నటి దఫా అట్లాగే ఉండుండి వెళ్లిపోయాను. వెళ్లిపోయానన్న మాటేగానీ, మనసంతా ఇక్కడే ఉంది. ఎలాగా మళ్లీ రాదల్చుకున్నాను. కనుక, ఆ వచ్చేది కల్యాణానికే వద్దామనిపించి, ఈ సమయానికి వచ్చాను. యాత్రీకుల హడావిడి అంతా అయ్యేదాకా ఆగాను. కల్యాణం ఇది వరకు చూశాననుకో, ఎన్నిసార్లు చూసినా చూడ వలసిందేగా అది. ఏవంటావా? ఎంతమంది కవలేదు పెళ్ళిళ్ళు? పార్వతీ పరిణయాలూ, రుక్మిణీకల్యాణాలూ, జాంబవతీపరిణ యాలూ... ఎన్నో వందలు, వేలు ఉన్నాయి. ఉంటే? అవన్నీ పుస్తకాల్లో ఉండేవే. ఇట్లా మహావైభవంగా ఇన్ని వేలు, లక్షలు జనం కలిసి ఏటేటా ముచ్చటగా చేసుకునేది సీతాకల్యాణం ఒక్కటేనమ్మా! ఉంది. దాన్లో ఏదో విశేషం. విశేషం అంటే లోక మంతా అనుకునే విశేషం. ఒక్క సంగతి చూడు – నీ వివాహం అయిన తర్వాత లోకంలో ఎన్నో కోట్లు అద్భుతంగా అయ్యాయి కదా పెళ్ళిళ్లు! ఇన్ని పెళ్ళిళ్ళకీ చేసే శుభలేఖల్లో ఓ మంగళ శ్లోకం వేస్తూ ఉంటారు. ఎప్పుడైనా చూశావా? చూసి ఉండవ్. ఏ ధన్యాత్ముడు రాశాడో, ఏనాడు రాశాడో చెప్పలేం గానీ మా మంచి శ్లోకం.

> జానక్యాః కమలామలాంజలి పుటే యాః పద్మరాగాయితాః
> న్యస్తాః రాఘవ మస్తకే చ విలసత్ కున్ద ప్రసూనాయితాః
> స్రస్తాః శ్యామల కాయకాంతి కలితాః యా ఇంద్రనీలాయితాః
> ముక్తా స్తా శ్శుభదా భవంతు భవతాం శ్రీరామ వైవాహికాః॥
> (శ్రీరామకర్ణామృతం 1-81)

అనే ఈ శ్లోకం ప్రతి శుభలేఖలోనూ కనబడక తప్పదు. లోకంలో ఇన్నిసార్లు అచ్చుపడ్డశ్లోకం మరొకటి లేదనుకో. ఏమి శ్లోకం? మీ కల్యాణమాంగల్యశోభంతా ఈ శ్లోకంలో ప్రతిఫలిస్తుంది. బిడియపడుతూ, సంబరపడుతూ ఎంత ముచ్చటగా తలంబ్రాలు పోశావమ్మా!

ఆ కల్యాణ సమయంలో శ్రీరామునిశిరస్సుమీద నువ్వుంచిన ఆ ముత్యాలతలంబ్రాలు తమకు శుభం కలిగించాలని ప్రతివివాహంలోనూ మీ కల్యాణంమాట తలచుకుంటూ ఉంటారు.

ఔనుగానీ– అమ్మా! మొన్న కల్యాణం చూసేప్పుడు ఓ సందేహం కలిగింది. తలంబ్రాల సమయంలో ఆ ముత్యాలు నీ దోసిట్లో ఉన్నంతసేపూ ఎర్రగానూ, దోసిట్లోంచి విడిచినప్పుడు తెల్లగానూ, ఆయనవంటిమీద జారిపోతూ ఉన్నప్పుడు నల్లగానూ – ఇలా రంగు రంగులుగా కనబడ్డట్లు ఆ శ్లోకంలో ఉంది. కానీ, రాముడు పోసినవి ఎట్లా ఉన్నాయో వాటిమాటే లేదు. దూరాన్నుంచి చూస్తుంటే తలంబ్రాలు ఎంతసేపూ నువ్వు పొయ్యడమే గాని ఆయనేమీ పోసినట్టు కనబడలేదు. మీ రోజుల్లో మగవాళ్లు పోసే అలవాటే లేదా? లేకుండా ఉండదు. రీవికి లోపమనో, బిడియపడో ఊరుకుని ఉంటాడు. అపుడు పదిమందిలోనూ ఎందువల్లో తలంబ్రాలు పొయ్యకపోయినా – లోకం అందరికీ తెలిసేలాగా కొసకి పొయ్యదలుచుకున్నవేవో– పోశాడుగా నీ నెత్తిన – ఏం మనిషి? "స్నేహం దయాంచ సౌఖ్యం చ, యదివా జానకీమపి, ఆరాధ నాయ లోకస్య ముంచతో నాస్తి మే వ్యథా" – లోకారాధనం కోసం జానకినైనా విడిచిపెట్టేస్తాడట! ఇదా లోకారాధనం?

పోనీ – పంపేటప్పుడు నీతో ఇలాంటి చిక్కొచ్చింది, తప్పింది కాదు, ఏమీ బాధపడకు – అని ఓదార్చి అయినా పంపాడా – అది లేకపోగా – 'ముని భార్యల్ని చూస్తానన్నావు కదా– చూసిరా!' అని మాయమాటలు చెప్పి, మరీ పంపేశాడు. నువ్వు అమాయకురాలివి! పాపం అదంతా నిజమే అనుకుని ముని భార్యలకిద్దామని అన్ని ముతక చీరలు – అప్పటికప్పుడు నీకెట్లా అమిరాయో గాని ఎంత మూట రథం మీద పెట్టించావు తల్లీ! లక్ష్మణుడు గంగను దాటించి, ఆ శుభవార్త కాస్తా నీ చెవిన వేయగానే ఆ మూట మూటా మెల్లగా గంగలోకి దొర్లించేసి ఉంటావ్. నాకా మూటే జ్ఞాపకం వస్తూ ఉంటుంది. ఎంత ఆశాభంగం? అన్నగారు "నిన్ను కానలలోపల దించి రమ్మనెన్" అని లక్ష్మణుడు చెప్పగానే ఆ పిడుగు లాంటి ఘోర వార్త విని, నిండు చూలాలివి ఎలా భరించావో? ఈ పని చేయడానికి నేనే దొరికానా? 'నన్ను ఏల భూనాయకుడిట్టి బెడద మొనర్పగ పొమ్మనె...' అని పాపం లక్ష్మణుడూ దుఃఖ పడ్డాడు. లక్ష్మణుడేమిటి? లోకమంతా ఈనాటికీ ఎంతో దుఃఖపడుతున్నాం. ఆ దుఃఖంలో రాముణ్ణి ఎవరైనా ఏదైనా పల్లెత్తు మాట అనబోయామంటే కళ్లెర్రజేస్తావు. నీతో అదో బాధ! అంత దుఃఖంలో ఉన్నప్పుడు కూడా ఆ గంగ ఒడ్డున ఏమన్నావూ – "నా సంగతి పూర్తిగా ఎరిగి ఉండికూడా ఎవరో తెలియని వాళ్లు నన్ను నింద వేసినయంత మాత్రమునకే అధిపు డులికి ఇంత తెగువ సేయ నిచ్చగించుట నా యభాగ్యము ఇంతే, ఒకరి పల్కనేల" అన్నావు గాని పరుషంగా ఒక్కమాట నీ నోటంట రానివ్వలేదే! అదే నీలో ఉన్న గొప్పతనం! మేం అట్లా ఊరుకోలేం. ఊరుకోలేకపోయినా ఆ చాటున, ఈ చాటున అనుకోటమే గాని ఆయనముఖమందు మేమూ అనలేం సుమా! ఇలా చనువు కనుక సంకోచం లేకుండా నీతో అంటున్నాను. ఆయనతో ఎప్పుడైనా అనేవు సుమా... కొంపదీసి... ఒకదానికొక్కటి.....

అదలా ఉంచుగాని– అమ్మా! నిన్ను విడిచి లక్ష్మణుడు వెనక్కి వెళ్లిపోయాక, అరణ్యమధ్యంలో దిక్కులేక నువ్వు వెక్కి వెక్కి ఏడుస్తుంటే– ఎవరివల్లో విని, వాల్మీకి నీ దగ్గరికే వచ్చాడు కదా! వస్తే అతనిచరణమ్ముల చెంగట వ్రాలావట! పాదాలమీద పడలేదట. ఏమీ? తాకటానికి సంకోచమా? పిచ్చి తల్లీ! తాకితే ఏమీ ఆ మహానుభావుణ్ణి? నీ తండ్రి జనకుడిని తాకవా? ఇదీ అంతే! అయితే తాను ఫలానా అని చెప్పేదాకా ఆయనెవరో నీకు తెలీదేమో? తెలిసినా జాగరూకతా, నీ మోతాదు, నీ స్థాయి, నీ మర్యాద అవన్నీ వేరేలే! దానికేం గానీ, నువ్వు పాదాలకి దగ్గరగా పడ్డప్పుడు వాల్మీకి "నన్నున్ మిథిలాధినాథువలె నీ చిత్తంబులో నెంచుమా! అన్నాట్ట కదూ! మా కంకంటి పాపరాజు విన్నాట్ట ఆ మాట! మంచివిలువైనమాట. ఒక్కమాటతో ఎంత ధైర్యంకలిగించాడు! తండ్రికి స్నేహితుడై నందుకు తగిన ఆదరణ చూపించాడు. అదెప్పటికీ మర్చిపోలేం. సరేగానీ తల్లీ! చూడూ, కొట్టకొసని... అయోధ్యలో యజ్ఞవాటికలో– "ఈ పాదులోకంలో ఇంక నేనుండలేను!" అని మీ తల్లి ఒళ్లో కూర్చుని, భూగర్భంలో కెళ్లిపోయావే! ఆ సమయంలో నీ కొడుకులు కుశలవులు పసివాళ్ళు కదా, ఆ సభలోనే ఏ మూలో ఉంటారని నీకు తెలుసు కదా – వాళ్లనికూడా నీతో తీసుకెళ్లాలని గానీ, లేదా వాళ్లనొక్కసారి కళ్లారా చూసి వెళ్లాలని గానీ, ఆ దృష్టి కొంచెమైనా నీకు కలిగినట్టు కనబడదే! మనసెట్లా ఒప్పిందీ! కన్నకడుపు కదా! ఆ మాత్రం తోచకుండా ఉంటుందా? అందులోనూ నీకు! కానీ అది మరీ కంగారు సమయం. అప్పట్లో వాళ్లమాట నీకు జ్ఞాపకం వచ్చి ఉండదు. అప్పుడు రాకపోయినా ఆ తర్వాత్తర్వాత వాళ్లక్కడున్నారో, ఎట్లా ఉన్నారో అని అనుకోకుండా ఉండవు.

వాళ్ల సంగతి ఏమైందో ఈ దేశంలో వార్తలు నీకు తెలిసీ ఉండవు.

### కొద్దిగా నే చెబుతా విను

నువ్వెళ్లిపోయిన తర్వాత రాముడు అయోధ్యలో అట్టే కాలం ఉండలేదు. కొద్దికాలానికే సరయూప్రవేశం చేసి, వైకుంఠానికి వెళ్లిపోయాడు. ఒక్కడే కాదు, అయోధ్యలో ఉన్న ప్రజలంతా ఆయనతోనే వెళ్లిపోయారు. విడిచిపెట్టగలరా మరి! ఏదో దుర్విధివల్ల ఒక్క నీ విషయంలో తబ్బిబ్బులొచ్చాయి గానీ, సరయూప్రవేశానికి ముందే నీ కుమారులిద్దరికీ చెరోచోటా పట్టాభిషేకం చేసి, రాజ్యాలు అప్పగించాడు. వాళ్లిద్దరూ మీ ఇక్ష్వాకు వంశంలో పూర్వీకులందరికన్నా చాలా ప్రజారంజకంగా పరిపాలన చేశారు. గొప్పకీర్తి సంపాదించారు.

అందులోనూ అమ్మా! ఆ పెద్దవాడున్నాడే కుశుడు, అతని సంగతి మరీ లోకోత్తరం. తండ్రిని మించిపోయాడు.

ఒక్కవిశేషం చెబుతా విను. రాముడితోబాటు అందరూ సరయూ ప్రవేశం చేశాక– అయోధ్యలో మనిషనేవాడు లేక పట్టణమంతా పాడుబడిపోయిందట. పోదా మరి? నేను అని నడుం కట్టుకుని పట్టణానికి, మునుపటి ఔన్నత్యం, ప్రాముఖ్యం, సౌందర్యం నిలబెట్టే నాథుడు లేకపోయాడట. అప్పుడు రాముడి అనంతరం 'నేను' అనవలసినవాడు కుశమహారాజు కదా అని ఆలోచించి అయోధ్యాపుర దేవత అతనితో తన కష్టాలు చెప్పుకుందామని ఓ రోజు రాత్రి వెళ్లిందట! కుశుడు రాజభవనంలో తాను పరుండే గదిలో నిద్రపోతున్నాడట! మధ్యన మెలకువ వచ్చిందట! కళ్లు విప్పి చూశాడు. ఎదురుగా ఒక స్త్రీ కనబడిందట! యువతి... లోకోత్తర సౌందర్యవతి!. ఎవరా అని తుళ్లిపడి లేచి కూర్చుని, "కా త్వం శుభే? కస్య పరిగ్రహోవా, కింవా తవాభ్యాగమ కారణంచ ఆచక్ష్వమత్వా వశినాం. రఘూణాం, మనః పరస్త్రీ విముఖ ప్రవృత్తిః" అన్నాట్ట. నాకెట్టా తెలిసిందంటావా? కాళిదాసు చెప్పాడు. అతడు ఇలాంటి సూక్ష్మాలు కనిపెట్టడంలో అసాధ్యుడులే! కుశడేమన్నాడో విన్నావు కదూ! తొందర పడుతూ సమాధానం చెప్పకు. ఒక్క సంగతి– ఇక్ష్వాకువంశపు రాజుల ప్రవర్తన ఎప్పుడూ పరస్త్రీవిముఖం అనే మాట మనసులో పెట్టుకుని, మరీ జవాబు చెప్పు!" అన్నాడు.

విన్నావా? ఎంత నిగ్రహం? ఎంత ధైర్యం? ఎంత ఠీవి? అరెరె....! ఈ అంశంలోమాత్రం కుశుడుదగ్గర రాముడు ఎందుకూ చాలడమ్మా. అహహా.... అనకు... నే చెప్పేదంతా పూర్తిగా విను.

మీరు.. పర్ణశాలలో ఉండగా రాముడుకోసం వచ్చింది కదూ శూర్పణఖ! తనను పెళ్లి చేసుకోమని అడిగింది కదూ? తరువాత అతను నిరాకరించాడనుకో – అది గొప్పే. అదట్లా ఉంచు. అసలు అడగనిచ్చాడా లేదా? స్వేచ్ఛగా అడగడానికి ఆమెకి అవకాశమిచ్చి ఔనని కాదనీ కొంతేసేపు ఆమెతో వాదోపవాదాలు నడిపించి, చివరికి తప్పించుకున్నా డనుకో. అసలు అంత దూరం రానివ్వచ్చునా అని? మరి నీ కొడుకు ఏం చేశాడో చూడు... "ఓయ్ ఎవరు నువ్వు? అది పడకటిల్లు. పైవాళ్లు రాదగ్గచోటు కాదు. ఆడదానవు. పైగా అర్ధరాత్రివేళ వచ్చావు. కంగారుగా కనబడుతున్నావు. అనుమానంగా ఉంది. ఎందుకో వచ్చావా... నాతో మాట్లాడకు. నోరు విప్పకు. మామూలు పనేదైనా ఉంటే చెప్పు!" అని మొదటే నోరు కట్టేశాడు. ముందు అనుచితమైన మాట అడిగించుకోటానికి ఒప్పుకుని, తర్వత నిరాకరించిండం గొప్పో, అసలు అడిగించుకోడానికే ఇష్టపడకపోవడం గొప్పో ఆలోచించు. అంతా ఇంతా అంతరమా. హస్తిమశకాంతరం! నువ్వు నూరు చెప్పు, వెయ్యి చెప్పు, ఈ విషయంలోమాత్రం కొడుక్కి తండ్రి బాగా తీసికట్టు. మనోనిగ్రహంలోనూ, ఏకపత్నీ వ్రతదీక్షలోనూ రాముడు దగ్గర నించోటానికీ ఎవరికీ అర్హత లేదు. అది ప్రపంచమంతా అంగీకరించిన పరమసత్యం. కానీ, ఆ పరనారీపరాఙ్ముఖతా పరాకాష్ఠను పాటించడంలో నీ పెద్దకొడుకుదగ్గరమాత్రం రాముడు నించోలేడు. ఎట్లాగో బిగపట్టి నుంచున్నా కాళ్లు మాత్రం వణక్క తప్పదు. కొడుక్కీ, తండ్రికీ అంత అంతరం ఉంది. ఆ తారతమ్యానికి కారణమూ ఉంది. అవతారమైనా, కౌసల్యాదశరథులలోంచి వచ్చిన అవతారం అది – సీతారాములోంచి వచ్చిన అవతారం ఇది. తేడా లేదు మరీ? సరి – ఏదో కాస్సేపు కష్టం, సుఖం మాటాడుకున్నాం. అమ్మదగ్గర ఎంత సేపైనా కూచోవాలనే ఉంటుంది. అయినా చాదస్తంగా ఆలస్యం చేయకూడదు. నీ కోసం చాలామంది భక్తులు ఎదురుచూస్తూ ఉంటారు. ఎప్పుడైనా మళ్లీ కూర్చుందాం. వస్తూనే ఉంటానుగా. ఏమిటమ్మా ఏదో అంటున్నావూ – కొంచెం గట్టిగా చెప్పు... ఓహో అదా..! నేను భద్రాచలం రావడం మళ్లీ ఎప్పుడంటావా? వస్తాను– మా జానకమ్మ తల్లి మళ్లీ ఎప్పుడు తలుచుకుంటుందో అప్పుడు.



